# సమాలోచన




## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ దూలుసు సీతారామ శాస్త్రి.

సంపుటము 4 | చంద్రవారము 16-3-1981 | సంచిక 1


### ఈ సంచికలో



1—4—81 సంచికలో కవిగా అప్పకవి ప్రతిభ, వేదమువారి యౌగంధరాయణుడు, వేగులవారి దీపావళి, వంగలవ యశోధర, సురభి మాధవరాయలు మొదలగునవి ఉంటాయి

1, 16 తేదీలలో ప్రచురింపబడును


చందా
సంవత్సరమునకు రు. 12—00
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-3-1981 సంచిక 10


## 'మాళవికాగ్నిమిత్రంలో శృంగారం'


– శ్రీ మామిడేల హరినారాయణశర్మ, ఎం. ఏ.


లోకోత్తర ప్రతిభా సంపన్నుడైన, కాళిదాసమహాకవి తన కావ్యకన్యకలను శృంగారవతులనుగా తీర్చి దిద్దినా డనడంలో సందేహంలేదు అచేతనములను సైతము సచేతనములుగా రూపించి రస వ్యంజకంగా రాణింపచేయడంలో ఆయన కళాకౌశల మభివ్యక్తమౌతుంది. విశేషించి కాళిదాసు కావ్యరప్తక మొక రసజగత్తు. నవరసాలలో శృంగారవీరములకే అగ్ర తాంబూల మిచ్చిన రస శిల్పి యాయన, కాళిదాసు నాటకత్రయంలో 'మాళవికా గ్నిమిత్రము' కొంత యౌవన పరిపాక మున సంతరించబడినది. అందుచేత నేమో మలినశృంగారంతో సాగిన ఈరచన అభి జ్ఞాన శాకుంతలం దగ్గరికి వెళ్ళేసరికి పరి శుద్ధంగా మారింది ఈ నాటకంలో శృంగారం ప్రధానం వీరం అప్రధానం. లౌకిక జీవితంలో ఈ రెండూపరస్పర పోషకాలే శృంగారం మానసిక కర్మ వీరం బాహ్యకర్మ వీరం ఎప్పుడూ శృంగారానికి పోషకమై దానిలో లీనం కావలిసిందే.

మాళవిక ప్రాయశః పెద్దది పరిమాణ మున చిన్నది అయిదంకముల నాటకము చరిత్ర ప్రసిద్ధుడైన అగ్నిమిత్రు డిందు నాయకుడు స్వచ్ఛంద సౌందర్యరాశియైన 'మాళవిక' యిందు నాయిక చిత్తరువులో ఆమె ప్రతికృతిని గాంచి సహజరూపము చూడనాకాంక్షించిన రాజునకు నర్మసఖుని యుక్తిచే సహజసౌందర్య దర్శనమే కాక నాట్యసౌందర్య దర్శన ప్రాప్తి కల్గినది అనూయోద్రేకముచేత ఇరావతి ఆటంక పరచినను, శృంగార సచివునిచే యవి నెట్టబడతాయి అశోకదోహద ఫలమును, కుమారుడైన వసుమిత్రుని విజయమును విని ఆనందపరవశురా అయిన ధారిణి (దేవి) తన రాజునకు మాళవికను దగ్గరచేస్తుంది. శిల్పకారికల ప్రవేశంతో మాళవిక 'రాజకుమారి' అని తెలుస్తుంది. పర్యవ సానం వివాహం–ఇది కథాసంగ్రహం

కేవలం శృంగార రసాన్ని పట్టుకొని కాళిదాసు కావ్యాలలో తొంగి చూడ టానికి వీలులేదు మరేమి చేయాలి! విశ్వ నాథవా రన్నట్లు' ఎవళ్లుచెయ్యనిది చేయ టానికి సాధ్యముకానిది అయిన ఒక మహా విషయ ముంది అది బహురసముల 'సంయోజనము' శృంగార వీర రసములకు కవి సంయోజనచేస్తాడు ప్రకృత నాట కంలో అట్టి సంయోజనం చెయ్యబడింది.

'శృ' అను హింసార్థక ధాతువునకు 'అరకన్' ప్రత్యయం చేరిస్తే శృంగార శబ్దం నిష్పన్నమౌతుంది. అహంకారాన్ని ఏది హింసిస్తుందో అది శృంగారం. వీరం సాహంకారం శృంగారం అహంకార నాశకం శృంగార నిర్వచనాన్ని శ్రీమ దభినవ గుప్తులవా రిట్లు చెప్పారు.

"యస్తు శృంగార శబ్ద స్యాత్మీయేన వ్యు త్పత్తి మాహాత స్వరూప మపి విస్మృతం అరకన్ ప్రత్యయో నాఽరక్

వృందారక ఇతి

యథా, అత ఏవ ఉణాదిషునిపాతితోఽ

యం శబ్దః"

మధుర భావాత్మకమైన శృంగారం ఉద్దీపనం చెందడానికి సాహంకారమైన వీరం అంగంగా ఉండవలె. కాబట్టి కాళి దాసాదికవు లందరు ఆనందస్వభావమైన శృంగారాన్ని అంగిగా, దానికి పోషక మైన వీరాన్ని అంగంగా చేశారు. మాళ వికాగ్నిమిత్రంలో శృంగారాన్ని రంగము నందు అభినయింపచేసి నేపథ్యంలో వీరాన్ని సూచించారు – అది అంగాంగి భావ సమన్వయం కాళిదాసు రససంయో జనం. రసానుభవానికి అనుకూలమై నిర్వేదం, హర్షం, యించుక చింత, దైన్యం మొదలుగా గల సంచారిభావాలు స్థాయి యైన రతికి అంగాలుగా నాటకంలో పలుచోట్ల అభినయింపబడినవి.

నాటకంలో శృంగారం పరిపక్వస్థాయిని చేరుకోడానికి ప్రధాన అంశాలు రెండు శర్మిష్ఠా కృతి ర్లయ చతుష్పద ప్రయోగం పొందటిది. నేపథ్యంలో వీరరస పోషణ రెండవది

నాటకారంభంలో అగ్నిమిత్రునికళ్ళు మాళవిక చిత్రపటగత సౌందర్యాన్ని దోచుకొంటాయి సహజ రూప దర్శన ప్రాప్తికొరకు తన ప్రణయవ్యవహార మంత్రి యైన నర్మసఖుడు యుక్తి పన్నుతాడు నాట్యాచార్య ద్వయ వివాద కల్పనమే దానికి ప్రయత్నం. ఫలితం - శిష్యురాండ్ర నాట్యవిద్యా ప్రదర్శనం. నాయికా నాయకుల మధ్య ప్రణయము అంకురించి వృద్ధి చెందుటకు పరివ్రాజిక నేపథ్యం నుంచి తోడ్పడింది. నాట్య పరీక్షకు అభినేయ విషయము శర్మిష్ఠాకృత ప్రబంధ మని నిర్ణయించుటచేత నాయికా నాయకుల పరస్పర హృదయావగాహనకు అవకాశం కల్పించబడింది.

లయ అంటే సామ్యము-సమత. సమతలో ఆనంద ముంది ద్రుతము, మధ్యము, విలంబితము, నని లయ మూడు విధాలు త్వరితగతియైతే లయ ద్రుతము.కొంచెము నెమ్మదిగా నడిస్తే విలంబితం రెండుకాని సమత మధ్యము. ఇది శృంగార హాస్య కారణం. భరతుడు నాట్యశాస్త్రంలో శృంగార హాస్య యోర్మధ్యలయః కరుణే విలంబితః వీర రౌద్రాద్భుత బీభత్స భయానకేషు ద్రుతః' అని సూచించాడు. శర్మిష్ఠాకృతి ర్లయ మధ్యము గనుక శృంగారరస భరితమైన దీ నాటకము. శర్మిష్ఠాకృతి అంటే - శర్మిష్ఠ యయాతి చిన్న భార్య దేవయాని పెద్ద భార్య శర్మిష్ఠ దేవయానికి దాసిగా నియమించబడింది యయాతిని వలచింది ఈస్థితిలో శర్మిష్ఠ = మాళవిక, శర్మిష్ఠాభినయము ద్వారా తన మనోభావాన్ని రాజునకు, తెలుప వచ్చును గాన నీచతుర్థ పాద ప్రయోగమును కావ్యకళాశిల్పి యైన కాళిదాసు ప్రవేశ పెట్టాడు ఇది రసౌచిత్యము. నాటకశిల్పము.

"దుర్లభః ప్రియో మే తస్మిన్ భవ
హృదయ నిరాశం
అహో అపాంగకో మే పరిస్ఫురతి
కిమపి వామకః
ఏష స చిరాదృష్టః కథ ముపనేతవ్యో
నాథ! మాం పరాధీనాం త్వయి
గణయ సతృష్ణామ్"

అయోగ శృంగార దశ యిది శర్మిష్ఠాభిప్రాయమే యిచ్చట మాళవికా మనోభావ వ్యక్తీకరణ హృదయ నైరాశ్యంచే నిర్వేదం, శారీరక స్పందనచే ఇంచుక హర్షం, చింతాక్రాంతత, దైన్యం మున్నగు సంచార భావములు శృంగార రసపోషకములు రెండవ పాదంలో 'అహో' అనునది అక్కడ తోచక పెట్టింది గాదు. రసానుభవ వ్యక్తీకరణను స్ఫురింపచేసే అవ్యయ మది కాళిదాస మహాకవి చేతిలో ప్రకృతి, అవ్యయము యేదియైనను రసస్ఫూర్తి నిస్తాయి. రసాత్మ కాళిదాసు గదా అందుచే ఆ మహాకవిని 'Estatic mind of India' అని అరవిందు డన్నాడు.

ప్రేమ కలాపములందు అగ్నితో చెలాటలాడే అగ్నిమిత్రునకు నాట్య సౌందర్యాస్వాదన కొరకు ఇంక కొంత అవకాశం కల్పించాడు శృంగార సచివుడైన విదూషకుడు. ఇది విదూషకుని వైలక్షణ్యము భారతీయ సౌందర్య భావనను ఆ మహాకవి అగ్నిమిత్రునిచే అనుభవింప చేశాడు విదూషకుడు లేకపోతే మాళవికాగ్నిమిత్రం లేదు విదూషకుడు వినా నాయకునికి నాయికాదర్శనం లేదు కాబట్టి శృంగార రసభావ బహిర్గమన సూత్రము - విదూషకుడుగా మనకు కనబడతాడు

మాళవిక నృత్యావసానమున నిలిచియుండు భంగిమ ని సర్గరమణీయము. కాళి బొటన వ్రేలితో పూలను కదిలించండలో, ఆ నర్తకి కనుకొనలు రంగస్థల వేదిక మీదికి మరలించుచు నిల్చిన తీరే మాళవిక రతియందు సంచరించు లజ్జకు చిహ్నము. భారతీయ సౌందర్య దృక్పథం తెలిసిన కళా తపస్వి కావుననే కాళిదాసు,

"వామం సంధి స్తిమితవలయం
న్యస్య హస్తం నితంబే
కృత్వా శ్యామా విటపి సదృశం
స్రస్త ముక్తం ద్వితీయం"

అని నాట్య సౌందర్యాన్ని వర్ణించాడు ఇంకను అనవరయౌవనవతి నిలిచిన భంగిమ నృత్యము కంటె మిగుల రమణీయముగా ఉన్నదట.

ముగ్ధయైన మాళవిక ప్రతిచర్య ఒక శృంగార చేష్ట, అగ్నిమిత్రుడు తన ప్రేమాయణంలో ప్రదర్శించిన అమాయికత, నైపుణ్యము సంతోషజనకములైనవి. తన ప్రియురాలిచర్యలను క్రింది విధంగా ఊహిస్తున్నాడు.

'భ్రూభంగభిన్న తిలకంస్ఫురితాధరోష్ఠం సాసూయ మానన మితఃపరివర్తయంత్యా కాంతాపరాధ కుపతే ష్వనయా వినేతు సందర్శితేన లలితాభినయ స్యశిక్షా'

బొమముడిచే చిట్లిన తిలకం గలిగిన ఆ ముఖాన్ని అసూయతో ప్రక్కకు త్రిప్పిందట. అది ప్రణయకోప ప్రదర్శన మున ఆమె నేర్చిన లలితాభినయ విద్యగా ఉండట - ఇది విప్రలంభ శృంగారావస్థ, చేతి మొలనూలు విడిపింపబోతే రాజు హస్తాన్ని నిరోధిస్తుందట అంతేగాదు మోహాపరవశత్వంతో కౌగలింపబోతే హస్తన్యస్తన శరీర అయిందట పక్ష్మల నేత్రమైన ఆననం పానం చేయపోతే ప్రక్కకు తిప్పిందటా శృంగారవతి డా, బొడ్డువల్లిపురుషోత్తంగా రన్నట్లు భోగాసక్తియుక్తమగు రసిక ప్రవృత్తికల్గియు, వీరత్వముతో విలసిల్లు యుగమునకు ప్రతినిధి అగ్నిమిత్రుడు.

శృంగారమునకు వెనుక వీరముండవలె, అది రస సూత్రం ప్రకృత నాటకంలో

శృంగార పోషణకు వైతాళికుల నేపథ్యంలో వీరాన్ని సూచించడంలో ఆరాంతర్య మదియే శృంగారం గృహ సంబంధమైతే వీరం సంఘం. అది కామం. ఇది అర్థం అది వైయక్తికం ఇది సామూహికం. ఇది లేకపోతే అది లేదు. దీన్ని డా. కోటేశ్వరరావుగారన్నట్లు ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలు మానవ మస్తిష్కం ప్రధానంగా ఆనందాంశ (కామం) అధికార సూత్రంగా విభక్తమౌతున్న దన్నారు. ఇది పవర్ ప్రిన్సిపుల్ ఇది సాహంకారం - వీరం

యజ్ఞసేన మాధవసేనులు రాజ్యాధికారం కోసం రంగంలోనికి దూకారు మాధవసేనుడు బంధించబడతాడు సౌందర్యరాశియైన మాళవిక మాధవసేనుని సోదరి. కాబోయే బావమరదిని విడిపించమని కబురంపితే కయ్యాన్ని కాంక్షించాడా యజ్ఞసేనుడు తన బావమరిదియైన మౌర్య సచివుని విడిపింపుమని పణముకోరాడు. దానికిష్టపడని మన అగ్నిమిత్రుడు సేనామండలాన్ని ఆజ్ఞాపిస్తాడు - ఇది వీరం ఫలం. శృంగార సంబంధం శిఖరాన్ని అందుకోవాలంటే వీరం సహాయం చెయ్యాలి - ఇది నాటక ప్రథమాంకగత శృంగారంలో వీరం దీని విజయ ఫలితం పంచమాంకంలో వైతాళికులచే నేపథ్యంలో సూచించబడింది ఇది కాళిదాసుని కళా వైదగ్ధ్యము.

తన మధుర లేఖినీ సంస్పర్శమునకు విజయవార్తను ధీరగంభీర శృంగార వీర రసాత్మకముగ పరివర్తింపచేసిన రస ప్రసిద్ధధారా ధుని కాళిదాసు రస సంయోజనం క్రింది విధంగా మార్చాడు.

'పరభృత కల వ్యాహారేషు
త్వమాత్తరతి ర్మధుం
నయసి విదిశా తీరోద్యాన
వనేష్వనంగ ఇవాంగవాన్
విజయకరిణా మాలానత్వం
గతైః ప్రతిలస్యతే
వరద వరదారోధో వృక్షైః
సహావనతో రిపుః

శ్లోక పూర్వార్థంలో శృంగారం, ఉత్తరార్థమున వీరం కోకిల కుహూ కుహూరావములతో కూడిన విదిశాతీర రమ్యోద్యానవనమున మన్మథునివలె మధుమాసాన్ని గడపడంచేత శృంగారదీప్తి, వరదాతీరమునందు సరదాగా శత్రువుపై విజయం సాధించటంచేత వీర దీప్తి. ఇచ్చట అగ్నిమిత్రుడు బాధ్యతారహితుడు. శృంగారంలో ఒక ప్రక్క తేలుతూ, మరొక ప్రక్క శత్రువును జయించుటచేత రాజుసచివాయత్తసిద్ధియే గాని స్వాయత్తసిద్ధి గాడని తెలుచున్నది 'అయమపరః కార్యాంతర సచివో అస్మానుపస్థితః' అన్న అగ్నిమిత్రుని మాటలే అందుకు సాక్ష్యం

తర్వాత 'విరచిత పదం వీర ప్రత్యా' ' అన్న శ్లోకంలో విష్ణువుకు, అగ్నిమిత్రునికి ఔపమ్యం చెప్పబడింది విదర్భ శ్రీని హరించిన సౌందర్యోపాసకు డగ్నిమిత్రుడు చతుర్భుజ బలంచేత విదర్భ రాజపుత్రియైన రుక్మిణిని విష్ణువు పొందెను. అది వీరం ఇది శృంగారరం రుక్మిణివలె మాళవికయు విదర్భరాజపుత్రి యగుట గమనార్హం. ఈవిధంగా ఆ శ్లోకంలో పరస్పర పోషకాలైన శృంగార వీరాలకు అంగాంగి భావసమన్వయం కుదిరింది పరస్పరవిరుద్ధములైన సుఖదుఃఖాలు రాజు హృదయంలో ఏకకాలమునందు లగ్నమయినాయి రాజుకు సుఖముకంటె దుఃఖమే అమితం రాజ్యవ్యవహారంలో జయప్రాప్తివల్ల సుఖం ప్రియురాలి సమాగమాలబ్ధి వల్ల దుఃఖం జనించినవి అది వీరప్రాయం ఇది శృంగార భావ జన్యం ''దుఃఖాయతే' మమ మనః 'సుఖమస్నతే చ' అన్న రాజు పద ప్రయోగంచే దుఃఖము ఎక్కువ శృంగార విషయవాంఛితుడుగాన నది సహజమే అగ్నిమిత్ర నామమును కవి యశిక్షిత కామవినాశమునకు చిహ్నముగా స్వీకరించె నన్న డా బొడ్డుపల్లి పురుషోత్తం గారి మాట లీపట్ల సార్థకాలు.

మాళవిక రాజునకు నయన మధు ప్రేమపారప్రగాఢబద్ధమైన దివ్యసుందరి మధువును త్రాగడానికి వీలు లేదు. ప్రక్కనే మక్షికాలు ముసురుకొంటాయి ధారిణి, ఇరావతి మక్షికాప్రాయలు. ఇరావతి నాయికా నాయకుల సమాగమమునకు ఎన్నో సార్లువిఘ్నములు కలుగచేయును కాని అవి తొలగించేయ బడినాయి వికసించిన గులాబిపువ్వునకు, వికసించుచున్న గులాబి మొగ్గకును గల స్పర్ధయే యీ స్పర్ధ ఇది నాటకమున కంతకును ప్రాతిపదిక 'సంయమన రహితమైన ఆత్మభోగపరాయణత్వ మెట్టి యనర్థముల నొడిగట్టించునో యీ రూపకము మనకు ప్రత్యక్ష మొనర్చును రాజునకు - రాణికి, అగ్నిమిత్రునకు ధారిణికి గల లక్ష్యవైరుధ్యమే యీ రూపకము' మాళవికను ఇరావతి నుంచి కాపాడడానికి నాగముద్రాంకిత అంగుళీయకం చతుర్థాంకంలో తన పని నెరవేర్చుకొన్నది

అశోక దోహదక్రియతో మనసిజ వృక్షం మొగ్గతొడిగింది అక్కడ 'చింత' అను వ్యభిచార భావం సూచకము ఒకనాటి రాజపుత్రిక ప్రస్తుతము రాజునకు పరిచారికయై ఆరాజునందే అనురక్తురాలై యుండుటచే సిగ్గు కల్గి తాను చింతిస్తూ భవిష్యత్క్రియనే మరచిందట, మదనావస్థలో ఉన్న మాళవిక మనసు మరవటం సహజమే కాదా.

ప్రథమాంకంలో చిత్రపట దర్శన మాత్రమున వేరూనిన మనసిజవృక్షం ద్వితీయాంకంలో నృత్య ప్రదర్శనంతో చిగిరించి అశోకదోహద క్రియతో మొగ్గ తొడిగింది ఆ మొగ్గ రాలిపోతుందో ఫలిస్తుందో ఇది గర్భ సంధి. ఫలిస్తే సుఖం, రాలితే దుఃఖం. ఒక్క రాజుకే కాదు.

రసజ్ఞు లందరికీ అది పరీక్షా సమయం. ఆ ఫలమే మాళవికా సంభోగం. మనసిజ వృక్షం ఫలించడానికి అంత వరకు పుష్పింపక మౌనం వహించిన రక్తాశోకం చతుర్థాంకాంతంలో అనూయోద్రిక్తయైన ఇరావతి ఆగ్రహానికి బలికానున్న మాళవికను రక్షించుటకై మొగ్గ తొడగాలి, అశోకం వారి ప్రణయమునకు! చిహ్నం అశోకం పుష్పిస్తే మనసిజవృక్షం ఫలిస్తుంది అది పుష్పించింది ఇది ఫలించింది

అశోక వృక్షం పుష్పించడమే కాక, ధారిణి తన కుమారుడైన సుమిత్రుని విజయవార్త విని ఆనందించింది అది వీరానికి జయం తత్ఫలితంగా ధారిణి ఆ యౌవనాంగిని పెండ్లికూతురుగా చేయమని ఆదేశిస్తుంది ఇంతలో శిల్పకారికల ప్రవేశంతో మాళవిక 'రాకుమారి' అని తెలిసికొని చందనపు కొయ్యను పాదుకగా ఉపయోగించితి నని పశ్చాత్తాపం చెందుతుంది. ఆనందంతో ఆ యౌవనోద్భాసిత సర్వాంగసుందరిని అగ్నిమిత్రునికి అర్పించిం దా సద్భావ విలసితయైన ధారిణి ఇది శృంగార విజయం. ఇట్లు బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు రసానందానుభవానికై సాహిత్యాన్ని అందించిన ప్రజాపతి కాళిదాసు రసానంద ప్రసాదనమే ఆయన లక్ష్యం. అట్టి రసానుభవానికి భారతజాతి తపించి పోయింది. అందుచేతనే ఒక యువజనునకు 'ప్రతిజన్మము నందు కావలిసినదేమో చెప్పమనగా అత డిట్లు వచించాడట.

"కాళిదాస కవితా, నవం వయః
మాహిషం చ దధి, సశర్కరం పయః
ఏణమాంస మబలా చ కోమలీ
సంభవన్తు మమ జన్మ జన్మని

తొలుత కాళిగాసు కవితను కోరాడు. శృంగార రసప్రధానమైన ఆ కవితాస్వాదనకు యౌవన మవసరం అట్టి మధుర పదార్థం ఒంటరిగా గాక తన ప్రియురాలితో కలిసి సేవించ దగినది. అట్టి మధుర పదార్థము మాళవిక.

ఆధారాలు -

1 కాళిదాస కవిత - డా॥ బొడ్డుపల్లి పురుషోత్తంగారు

2 మాళవికాగ్నిమిత్రం డా॥ పాటిబండ మాధవశర్మ గారు. (ఆంధ్ర కరదీపికా వ్యాఖ్యానము)

— —

# ❋ సులోచన ❋

- డా పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం ఏ, పిహెచ్.డి.

( గత సంచిక తరువాయి )

ఆస్థానమధ్యమున రాముని గాంచిన సులోచన సద్భక్తిపూర్వకముగ శిరము వంచి ప్రదక్షిణములు చేసి మ్రొక్కి 'దేవాదిదేవేశ రావారి వాశ ' అని ప్రస్తుతించిన తీరు ఆమె భక్తి భావమునకు నిదర్శనము ఎందరో భక్తులను గాచిన కరుణాసముద్రుడగు ఆస్వామిని తాను మరుగు జొచ్చిన దని విన్నవించి ఆతనికి సంతోషమును కలిగించినది తన విషయమంతయు వినయముతో వివరించినది 'సభ్యు లందరును నిర్జీవహస్తము నిజముగా తర్జని వ్రేల భూతల పత్రమందు వ్రాయుట' అబద్ధ మని తలచి ఆమెను అసత్యవాదినిగ తలచినారు అప్పుడు సులోచన

'అఖిలాండకోటి బ్రహ్మాండనాథుండవు
నఖిలప్రపంచ భూతాదుల యందు
భానుండు ఘటమున బ్రతిబింబరూప
మైన చందంబున నంతరాత్ముడవు
•
అనృత భాషణముల నధిపతి నీయెదుట -
ననృతంబు లాడిన నవి దాగునయ్యా
ధర ..కులశీలధర్మతాత్పర్య
పరమ పతివ్రతా పద్మాత్ములరయ-
ధరణీశ యనృతంబు తగనాడగలరె .'

అని పలికిన పలుకులు, శ్రీరాముని సర్వాత్మునిగ భావించి పరమాత్మునిగ ఎఱిగిన ఆమె భక్తిభావమునకు, అనృతభాషణము నొక హేయముగా నిరూపించిన విధము, పతివ్రతలట్టి భాషణము కలలోనైనను ఎరుగరు అనిపలికిన పద్ధతి ఆమె గంభీర చతురభాషణమును, సతీత్వమును నిరూపించుచున్నవి

ఆమె పాతివ్రత్యమును లోకమునకు చాటదలచి శ్రీరాముడు 'ఇంద్రజిత్తు మస్తకమును కలకల నవ్వించవలె' నను పరీక్షను పెట్టగా ఆమె 'అనుమానమేల' అనియు 'అద్రిసంచరులు, అనిమిషాదులు చూచి యౌనౌననంగ, జననాథ నీ మహాసంనిధానమున, నానాథుశిరము నే నవ్వించుదాన'- అని ఆమె పలికిన పలుకులు, తనపాతివ్రత్యముపై ఆమెకు గల విశ్వాసమునకు, ఇంద్రజిత్తు ఏక ప్రాణముతో తనకొఱ కెదురుచూచుచు బ్రతికి యుండినాడను నమ్మకమునకు నిదర్శనములు

పరీక్షార్థము ఇంద్రజిత్తు శిరము ఆమె ముందు పడవేయబడినది పాఱవైచిన సమయమున ధూళిక్రమ్ముకొనక, ధరణిపై బడినధవునిశిరము నెత్తి, పైటచే తుడిచి, తొడపై నుంచి, కన్నీటిచే అభిషేకించిన తీరు ఆమె దుఃఖమునకు, పతిశిరమునకే శుశ్రూష చేయు స్వభావమునకు నిదర్శనములు ఈ సన్నివేశమున ఇంద్రజిత్తు శిరమును నవ్వించుటకు ఆమె చేసిన సంభాషణము, ప్రయత్నము కరుణరసాలవాలము ఘనమైన వారియింట పుట్టి, ఘనమగు వంశమున మెట్టిన తనమాటను

నిలిపి, తన ప్రతిజ్ఞను నిజము చేయుమని ప్రార్థించినది సర్వమునులచే మన్ననలు పొందిన తనకు అంత్యకాలమున అసత్య దోషము కలుగనీయఁగలవనియు, సతి అర్థ దేహము సతి అపఖ్యాతి ఇహపరలోకము లందు పతిదే యనియు పలికినది నిను వేడుకొనియెద నీకు మ్రొక్కెదను - నను జిన్నపుచ్చక నవ్వవేనాథ! అని ప్రార్థించినను నవ్వకపోవుట తన్ను నగుబాటు చేయుటకా? సౌమిత్రిచే పరిభవమునందుటచే పరితాపమంది పరమ ఖేదము నందుటవలననా? లంకాధిపతి లోకువ పడుటకు ఆలోచనస్థుడగుటవలననా బల్లిదుడగు అతడు పగవారిచేత పరాభవము పొందినందులకు కలిగిన తల్లడము వలననా?

అని పరిపరి విధముల విలపించినది

'మామామ రావణుండు- పరుష వాక్యము లాడి పగవారిమీద నిను బంప నీవత్తి నిజముగా, బోవుమనుగల్గనాథ నాముందట మాట, తెలిసిన వేవేగ దెత్తునేపోయి - బలశాలి మాతండ్రి ఫణిలోకభుని, నతడు పాతాళ సైన్యావృతుం డగుచు - నతి వేగముగ వచ్చునా సహాయముగ

మఱియు శాత్రవులు - జితమునీకియదే జిహ్మగాధిపుడు వాసుకిదీ తక్షకవలయుండై శేషు, డీసున రాఁ బుట్టు నేయింతచేటు, అది తప్పె ' అని పలికినది. ఇంద్రజిత్తు రణభూమి కేగు సమయమున ఆవిషయమును ముందుగా ఆమెతో చెప్పకుండుట వలననే యింతటి విపత్తు కలిగిన దట. లేనిచో తనతండ్రి సహాయముచే అతడు జయము నందియుండు నని ఆమె భావము ఇట్టి సులోచన అమాయికత్వమునకు ఆశిరము ఫక్కన నవ్వినది ఆమె ఎవరిని తనకు సహాయునిగా తీసుకువత్తునని పలుకుచున్నదో, అతడే తనమరణమునకు కారణమైనాడను విషయము ఇఁట ఇంద్రజిత్తు హాసమునకు కారణము. ఈ హాసమే ఆమెను నలుగురి ముందర పతివ్రతగ నిలిపినది అనృతవాదిని కాకుండ రక్షించినది

ఆమె పాతివ్రత్యమునకు మెచ్చిన రఘురాముడు వరము కోరుకొమ్మనినాడు ఆసమయమున సులోచన నాల్కపై, దేవతల ప్రార్థనపై సరస్వతి ప్రవేశించి యిట్లు పలికించినది.

' మఱి యితరాపేక్ష మానసంబునను గలుగదు నీ పాదకమలములాన- తలప నాకిహలోక ధావంత మేల యలసి వేసారితి నా నింకఁ జాలు' సులోచన పతిప్రాణము లను కోరునేమొ అని దేవతల భయము. అందుచే సరస్వతిని ఆవహింపచేసి ఆమె పలుకులయందు సంసార విముఖత్వమును, వైరాగ్య భావనమును గలిగించినారు సులోచన రాముని నాలుగు వరములు కోరినది 1 వరుని మస్తకము నిచ్చుట. 2 పాపదుష్కార్యాది పాశ జాలముల ఖండించి మోహాంధకారంబు లెల్ల జండించి రాము పాదాబ్జాగ్రంబున చేరుట 3 తన సహగమన సమయమున కపివీరులు విజృంభించి సమరము చేయకుండుట 4 సహగమనమును చూచుటకు అత్తమామలు వత్తురుకనుక, కన్నతండ్రులగు రామలక్ష్మణులు, పినమామగారగు విభీషణుడు రావలయును అనుట — ఇవి సులోచన కోరిన వరములు ఇవి ఆమె వ్యక్తిత్వమునకు తగినట్లుగానే యున్నవి ఇట సులోచన ఇంద్రజిత్తు ప్రాణములు కోరినచో రామాయణ కథయే మారియుండెడిది ఈవరములు ఆమె వ్యక్తిత్వమునకు మరింత వన్నె కలిగించుచున్నవి

రామచంద్రుని మెప్పించి, పతి శిరమును దెచ్చి రణరంగమున ప్రవేశించి, అతని శరీరమును శిరమును బాహుదండమును గూర్చి సహగమనమునకు సిద్ధమైనది ఆమె కోరికపై ఇటు రామాది ప్రముఖులు, అటు సమస్త లంకా నగరవాసులు అరుదెంచినారు. అంతేకాదు బ్రహ్మాదిదేవతలు, మహర్షులు విచ్చేసినారు సహగమనాతుర సచ్చరిత్ర యగుచు, శ్రీరామ నామోచ్చారణము మనసులోపల చేయుచుండు సులోచనను రక్షించుటకు ఆమె తండ్రి అహిపలాధిపుడు ముందునకు వచ్చినాడు అప్పుడు సులోచన 'సుర తాపసులకుఁగా శుభమాచరించు, ఋషి మహాధ్వరకార్య రూపివై వెలుగు, విషమహానిధి చూడు విజ్ఞానవీథి, బదర కీలాగువ పాఁడియే తండ్రి' అని పలికిన పలుకులు ఆమె వికసిత హృదయమునకు, లోకహితపరాయణతకు నిదర్శనములు.

రావణునితో 'విత్తాధిపానుజ వినుమయ్య నీవు' అని బ్రహ్మవంశాగ్ర సాగరోదయు డగు అతడు లోకకంటకుడైనాడనియు, గర్వాంధకారి యగు అతనికి సమరరంగమున శ్రీరాముచే ముక్తి కలుగుననియు, జలరాశిలోపల జలముచే మునిగి మత్తుండై పోక, మహితాత్త్రరాముఁ జిత్తమందిక నైన జింతించి చూడు మనియు ప్రార్థించినది తన చివరి కోరికచే నైనను రావణుడు పరివర్తమంది సీతాదేవి నప్పగించి, కులనాశనము కాకుండ చేయునేమో అని ఆశ ఇట్లు తాను మెట్టినింటిని నాశనముకాకుండ నిలుపవలయునను తాపత్రయము ఆమెయందిట వ్యక్తమగుచున్నది

చివఱకు ఆమె పేరు పేరు వరుసను మ్రొక్కి, సెలవు తీసికొని, పరమాత్ముని తలచి, చితిమీది కెక్కి సహగమనము చేసినది దివ్యతేజముతో వైకుంఠమును చేరి, దేవకాంతల ఆతిథ్యమును పొంది భర్తతోకూడి విహరించినది ఇట్లు సహగమనము ఆమె పతిభక్తికి నిదర్శనము.

ఇట్లు ఈ కావ్యమున సులోచన, లంకానగర ప్రజలు, శత్రుసేన లగు కపి వీరులచే మాత్రమేగాక సాక్షాత్తు శ్రీరామునిచే కూడ పుణ్యసాధ్విగా, ధర్మచారిణిగ, సర్పవంశమును, అసురవంశమును ఉద్ధరింప ప్రభవించిన ధన్యురాలుగ, మహిని పతివ్రతలలో సాటిలేని మేటిగా పొగడ్తల నందినది. అంతేకాదు 'సుశీల

# ఆంధ్ర కవులు - అభ్యవహార పద్ధతులు

- శ్రీమతి భాషాప్రవీణ కె వి రంగనాయకి, ఎం. ఏ

( గతసంచిక తరువాయి )

మరికొందరి అభ్యవహారపద్ధతి యీ క్రింది విధమున నుండెడిది. 'అభ్యంగ మాచరే న్నిత్యం' అను ఆయుర్వేద సూక్తిని బట్టి అంగమర్దనము తోడి తల గడుగుండెడిది మడిగా నారవేసిన చల్వ మడతలు చందన చర్చ, గృహమాధవ దత్త మనోజ్ఞభోజనము, ప్రసూన దామ కంబులు, కపురంపు వీడ్యము

ఆయన్నము మామూలు బియ్యములో వండినదికాదు

మరుతాహతిరాలు నారికేళ ఫలాళి నిడిని జల్దించిన పుండ్రేక్షురసము, చిలుక పోటులచేత చిరిగిన సహకారఫలము నుండి తొరగవచ్చిన తేనెలు, చిక్రోడ దంష్ట్రిల చెక్కబడిన సుగంధి యరంటి పండ్లనుండి కారు నవ్యసుధలు, పాక వేళారంభమున తమయంత తాముగా పగి లిన పనస క్రొంబడ్ల రసములు - ఇవి యన్నియు నేకమై కాలువగా ప్రవహిం పగా ఆకాలువక్రింది యూటలతో బం గారు తీగెలవంటి రాజనములు పండును.

వండి వడ్డించిన ఆయన్నమును దేవ తార్చనము కావించినంతనే పుండ్రేక్షు రుచి, సహకారమాధుర్యము, సుగంధి యనంటి పండ్ల పరిమళము, పనసక్రొం బండ్ల మనోజ్ఞవాసనా లహరి గుబాళిం చెడివి ఆనాటి వారి కట్టి భోజనమే ఆత్మ కింపైనది

వచ్చిన యతిథులకు తిరువారాధన మైన యంతనే వృద్ధాను క్రమముగా దివ్యామోద శ్రీతులసీ కోమలదళ సురభి తంబైన సాలగ్రామశిలావారి నొసగి తదను భుక్తములైన శాల్యన్నములు, నేతులు, వరుగులు, చారులు, పప్పులు, అప్పడ ములు, తాలింపులు (పచ్చళ్ళు) అపూప పములు, పరమాన్నములతో వృద్ధాను పూర్వకముగా విందులు జరిగెడివి.

విందునకు కొంచెము ప్రొద్దుపోవు నను సంశయమున్నచో సాధుగుప్తము లను (మడితోమూతలు వెట్టిన వన్న మాట)

'రారయ్య! యని శుద్ధిమచ్చరణు గో
   త్రాదేవతావుత్రు వి
స్మేరాగ్నిప్రభు గూరు చుండ నిడి ప్రో
   క్ష్యపట్టుగావించి నీ
రారంబండిన ప్రాతరాజనపు ది
   వ్యాన్నంబు నొక్కింత వా
ర్ధారాధౌతము గుండయూడ్చి యొసగెన్
   రంభాఫలాశంబునన్'

దానిని వారు పాయసమువలె భక్షిం చెడివాడు.

ఇప్పటివలెకు జరిగిన విందులు, ఫలహార ములు వానిని మెచ్చుకొను విధము లోక సమాజములు. కాని తిమ్మనార్యుని ముద్దు పల్కులలోని మాధ్యమో కృష్ణపర మాత్మ భుజించు పదార్థముల విశేషమో కాని యాతడు సాంబుడు సాత్యకి మున్నగువారితో భోజనము చేయుచుండ ఆపదార్థములరుచిని కంకణములే వర్ణి ణించుచున్న వట ఏమి ఆశ్చర్యము. కృష్ణపరమాత్మ హస్తస్పర్శచే అచేతన పదార్థములకు కూడ చేతనత్వ మబ్బిన దేమో?

మేఖలాకీలిత రత్న కింకిణులు త్వరగా వడ్డింపుడు అని హెచ్చరించుచున్నవట. దువ్వలువపింజలు కలమాన్నరుచితో కల హించుచున్న వట. మెట్టియ లతిప్రియ ముగా నారగింపు మని యనునయించు చున్న వట ఈ విందతి లోకరమణీయ ముగా నున్నది ఇట్టి విందారగించిన శ్రీ కృష్ణుఁడు గంధోదకంబుల గరంబుల గడిగికొని కర్పూరతాంబూలమును అతి థుల కిచ్చి సత్కరించినాఁడు

ఈ అభ్యవహారపద్ధతి అష్టదిగ్గజము లందరిలో కానుపింపదు సమకాలిక లగుటవలన నేమో? వారిలో కొందరు మాత్రము వివరముగా చవులూరునట్లు వర్ణించినారు. వానిలో ముఖ్య తిమ్మనా ర్యుని ముద్దుపల్కులలోని వైచిత్ర్యము మరింత విశేషము ఇట్టిది మరే యితర కవులలోను కనుపించ దనుటలో నతిశ యోక్తి యుండ దేమో?

ఇక తరువాత వీరిలో రసికుఁడు, శ్రీనాథ కవిసార్వభౌమునివలె చమత్కార శేఖరుడును అగు తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము నందు మంచి కొంత వరకీ పద్ధతి కనుపించుచున్నది

సుశీలభర్త యింటలేని సమయమున వటువేషమున విష్ణుమూర్తి యరుగుదెంచి యాకలిగొన్న వానివలె నలమటించి భోజ నము పెట్టు మని ప్రార్థించును ఆమె వంటచేయుట కాలస్య మున్న దని సాధు గుప్తములన, తైలపరిపక్వములగు అపూప ములను, చల్దిని సద్యోజనితంబులవలె చవు లూదవునట్లుగా వడ్డించినది అతడు సామాన్య వటువు గాడుగదా! పెట్టిన

---

మానితాఖిలలోక సామాన్య సౌజన్య- వతత సద్గుణగణ్య పదమలపుణ్య-పతివ్రత అని వాగీశుని భార్య యగు సరస్వతిచే మన్నన అందిన మేటి సాధ్వి. ఇట్లు ఈ కావ్యమున పతివ్రతా శిరోమణి యగు సులోచన పాతివ్రత్య ప్రభావముచే శ్రీరామచంద్రుని మెప్పించి, సహగమ నముచేసి, 'కమల, అంబిక, వాణి, ఖగ రాజు రాణి' - అందరానట్టి ఉత్కృష్ట పదవిని దేవలోకమున పొందిన సాధ్వి. ఇట్టి సాధ్వి చరితము లోకమునందలి స్త్రీలకు మేలుబంతి.

వానిని అన్నిటినీ ఒక్కనిమేషమున భుజించినాడు. ఇంకను తెమ్మనగా 'శ్రియ మిచ్చెద్దు తాళనా' త్తను మాట నెరిగినది కావున మనమున నాతని ప్రార్థించినది. అంతట నాతని యనుగ్రహముతో నచ్చెరువును గొల్పుచూ

ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగులు
నొక కొన్ని తెరగుల యొలుపుపప్పు
లొకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు
లొక కొన్ని విధముల యొజ్జిచేరు
లొకకొన్ని కలకల్వ లొక కొన్ని బజ్జులు
నొకకొన్ని రీతుల యూర్పువగలు
నొకకొన్ని సిగరులు నొకకొన్నియంబళ్లు
నొకకొన్ని వహులవూపోత్కరములు

వివిధ ఫలకంద మూలమ్ములవియు గొన్ని
యూరుబిండులునొకకొన్ని యొక్కకొన్ని
యూరుగాయలు పచ్చళ్లు నొక్కకొన్ని
పెరుగు పాత్తైన నేతులు పెచ్చువెరుగ

ఇంతకు పూర్వము జరిగిన భోజనవిధానము వేరు. ఈ కాలము నందున్న భోజన విధానము వేరు శ్రీనాథ కవి సార్వభౌముని సమయమునకే పిండి వంటకముల సంఖ్య యధికముగా నుండెడిది ఇప్పుడవియున్నను, వానిని మించి వ్యంజనముల సంఖ్య అధికముగా ప్రచారము నందినది.

అతరువాత మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రమునందు కొన్నిటిని చెప్పినాడు పాండురంగ మాహాత్మ్యమునందు హుతాశనుని అనుగ్రహమునవలె ఇక్కడ మణి యనుగ్రహముతో మణినుండి

'కలమాన్నంబు ఘృతంబు పాయసముశా
కవ్రాతముల్ పిండివం
టలు పాల్దేనియ జున్ను దెన్నియుడిపూ
నాలుక్కరల్పక్కరల్
ఫలము ల్పానకము ల్రసాయనము లం
బళ్ళూరు పిండ్లూరు గా
యలు బజ్జుల్ దధి పిండ ఖండములు నం
దావిర్భవించెం దగన్.'

వీనిలో శ్రీనాథమహాకవి చెప్పిన పిండి వంటకముల కన్న ఇడియాసాలు ఉక్కరలు మున్నగు కొత్త పిండివంటకములు కనపడుచున్నవి. బజ్జులుగూడ ఈరాయల యుగమునందే వ్యాప్తిలోనికి వచ్చినవి.

శ్రీనాథ మహాకవి పెట్టిన బువ్వపుబంతి తరువాత మరల ఆంధ్ర సాహిత్యమున బువ్వపుబంతిని పెట్టించినవాడు పింగళి సూరన ఇదియును ఆతనికివలె సీసపద్యరచనము. కళాపూర్ణోదయము నందలి ఈబువ్వపుబంతి నారగింపుడు.

కలవంటకములు బూరెలు, దోసెతోలలు చా
పట్లు మండెంగ లొబ్బట్లు వడలు
గుడుములు నుకియలు గడి యంపుటట్లు వె
న్నప్పాలు వడియంబు లప్పడాలు.
బొంగరంబులు సొజ్జబూరె రాగులు సేవ
లుక్కెర లరిసెలు జక్కిలములు
ఖర్జూరగోస్తనీ కదళికా సహకార
ఫలములు గొబ్బెర పనసతొనలు
దేనియలు జున్ను మీగడ లానవాలు
శానకములు రసావళ్ళు బచ్చడులును
వ్యాజములుపుబప్పులుగూరలనుపమాన్న
మపుడుప్రజ నిల్లదనియించెనహరిహంబు.

వెనుకటి మహాకవుల పిండివంటకముల సంఖ్య కన్న ఇం దధికముగా మరికొన్ని చెప్పబడినవి కుడుములు, అట్లు, బొంగరములు, సొజ్జబూరెలు, వెన్నప్పాలు మున్నగు పిండి వంటకము లన్నియు నిప్పటివారెరిగినవియే పెండ్లికి ముఖ్యమైన అరిసెలను చక్కిలములను మాత్రము ఈతడు మరచిపోలేదు అప్పడములు వడియములు లేనిదే పెండ్లివారికి తృప్తిగలుగదట ఈ రెండు లేని పెండ్లివిందును అసంతృప్తిగా భావించుట ఇప్పటికి ఆచారముగ నున్నది. శ్రీనాథమహాకవి వీటి నేల చెప్పలేదో? ఆతనికి పిండివంటకములపై కల మోజు వీనియందు లేదేమో ?

ధూర్జటిది అచ్చమైన శివభక్తి. తిన్నని ద్వారా ఆ శివభక్తిని మనకు తెలియ జేసినాడు. శివునకు తిన్న డాహారము నొసంగినాడు. ఈ ఆహారము పైవారందరూ పేర్కొన్న కలమాన్నము కాదు. పాయసమంతకన్నను కాదు. కేవల మాంసాహారము మాత్రమే. ఆ మాంసమును చక్కగా పేల్చి తీసుకొని వచ్చి పరమేశ్వరుని భుజించుమని ప్రార్థించినాడు. అత డూరకుండగా

కాలవొ క్రొవ్వవొ మాడం
గాలెనొ చవిగావొ కమ్మగావో సిబెన్
జాలవొ యలవడవో శివ
వేలా కరకట్టు పార్వతీశ్వర చెపుమా!

అని ఆమాంసము తినక పోవుటకు కారణములను గ్రుచ్చియడిగినాడు. తిన్నడు ఆటవికుడు కదా! ఆతనికి కలమాన్న మెట్లు తెలియును ? ఫలహారమునకై రకరకముల ఫలములు మాపల్లెయందు గలవు రమ్మని శివుని ప్రార్థింప ధూర్జటి స్వయముగా విని మనకందరకు తెలియుటకై తన కాళహస్తి మాహాత్మ్యమునందు ఈ విధముగా పొందుపరచి యున్నాడు.

నేరేడి పండులు నెల యూటి పండులు
గొండ మామిడి పండ్లు దొండపండ్లు
బొలపండులు నెమ్మిపండులు బరివంక
బండులు జిటి ముటి పండ్లు గవిలె
పండులు దొడి వెందపండ్లు దుమ్మికిపండ్లు
జానపండ్లును గంగరేను పండ్లు
వెలగపండ్లు పుల్లవెలగ పండులు మోది
పండ్లు నంకెన పండ్లు బలుసు పండ్లు,
బీరపండ్లును బిచ్చుకబీరపండ్లు
గొమ్మిపం డ్లీత పండ్లును గొంజి పండ్లు
మేడి పండును మొదలుగా .

అని ఇరువది మూడు రకముల పండ్లను పేర్కొని ఇంకను చాల కలవన్నట్లు మొదలుగా అనినాఁడు. ఇవి కాక ఇంకెన్ని పండ్లున్నవో? (ఇవియైనను ధూర్జటి ధర్మమా యని మనకు పేర్లు మాత్రమే తెలిసినవి.) వెనుకటి మహాకవులందరూ ఫలహారమును గూర్చి చెప్పినను రంభాఫలములు, మావిపండ్లు, దాడిమ, పనస మున్నగు వానిని కొన్నింటిని మాత్రమే చెప్పియున్నారు. కాని ఇన్నిపండ్ల నెవ్వరూ చెప్పి యుండలేదు ఆ తరువాత కవులు కూడ ఇన్ని పండ్లను గూర్చి చెప్పినట్లు నాకు కనుపించదు. ఈపైచెప్పిన పండ్లయందు చాలపండ్లు ఇప్పటివారికి తెలియవు. ఇంతటి ఫలాహారమును పెట్టిన మహాకవి మరియొక్కడీసారస్వతమునందు లేడేమో అనిపించుచున్నది

ఈమహాకవి కేవలము ఫలాహారమును మాత్రమే చెప్పి యూరకుండలేదు. పాయసమునకు ముఖ్యములైన ప్రాలెన్ని రకములో కూడ వివరముగా చెప్పినాడు.

ఓలింగము విను నివ్వరి
ప్రాలును నొడి పిల్క గునుకు
బ్రాలును వెదురుం
బ్రాలును నవరపు మెకముల
ప్రాలునుగల వచట నీకు బాయసమునకున్.

ఇక 'మధ్యే మధ్యే పానీయ' మునకు మధువు ఆమధువులో కూడ అనేక రకము లున్నవట. చాలమందికి తెలిసినవి పుట్టతేనె, గట్టు తేనె, కొండ తేనెలు మాత్రమే, కాని ధూర్జటి

పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱ తేనియ గల వందు దోచి తోచి
కాలి దులదులనై పిండి పోలె రాలు
నట్టి నిం జెట్లు గలవు నీ కారగింప.

ఇన్ని విధములగు ఆహారపదార్థములను అవియును ఆటవిక సంబంధ మగు వానిని మన మెక్కడను చూచి యుండము. మహేశ్వరాంఘ్రి కమలధ్యానైక తత్పరుఁడగు వాని కివి యెట్లు తెలిసినవో నాయూహకు రెండు కారణములు తోచుచున్నవి. 1) సాక్షాత్తుగా పరమేశ్వరుడు భాగవతుల చరిత్రను ధూర్జటి హృదయమునకు తెలుపుట రెండవది కృష్ణరాయలతో మృగయావిహారము సల్పుచున్నపుడు ఆయా అడవులయందలి తరు ఫలంబుల విశేషంబుల నీత డరసి యుండును. ఏది ఏమైన ఈతని అభ్యవహారము మాత్రము చాల విలక్షణముగా నున్నది.

ఈఅభ్యవహారమునుగూర్చి చాలమంది మహా కవులు పేర్కొని యున్నను వారందరూ కవిసార్వభౌముని అడుగు జాడల నడచినవారే. అదియును కొంత వరకు సమంజసమే. 'యథా రాజా తథా ప్రజా' కదా! కాని ఈతడు మాత్రము అతని యడుగు జాడల నీవిషయమున అనుసరించలేదు ఈశ్వరార్చన కళాశీలత కినుమంతయు తీసిపోని మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైక తాత్పర్యమే దానికి కారణము కానోపును మరొక విశేషము. ఈతడే ధూర్జటిగదా!

ఇక రాయల యనంతరము దక్షిణాంధ్ర వాఙ్మయమున మిక్కిలి పేరెన్నికగన్న వాడు కంకంటి ఈతడు రామాయణమున మహర్షి సత్తమునకు చక్కని విందు భోజనము పెట్టించినాడు ఆవిందు ఇది.

వడియము లొల్పుబప్పుఁగల
వంటకముల్ వరుగు ల్ఫలాదులుం
బడిదము లప్పముల్ వడలు
పాయసముల్ కలమాన్న మాజ్య మ
ప్పడములు గూరలుం బెరుగుఁ
బచ్చడు లాదిగ నించి భోజనం
బిడిన నతండు మెచ్చుచు య
థేష్టముగా భుజియించి పోయినన్'

ఈపైవానితో దూర్వాస మహర్షి సంతుష్టుడైనాడు. రాముడు భోజనము పెట్టిన సంతృప్తి పడనివా రుందురా? సులభకోపుడగు దుర్వాసమర్షిని సయితము సంతృప్తి పరచె ననగా ఈభోజనము ఎంతశక్తిమంతమైనదో తెలియుచున్నది.

ఈవిధముగా పరికించిన ఆంధ్ర కవుల అభ్యవహార పద్ధతులు నాటినుండి నేటి వరకు వారివారి వర్ణన ప్రాభవముల ననుసరించి ఆంధ్ర సారస్వతమున పరితలకు చవులూరించుచున్నవి.

'అచ్యుతమైనను చవులజాత్యైన్న సమమే'

— —

# తుమ్మలవారి 'రాష్ట్ర గాన' రామణీయకత

- శ్రీ కరెవరపు వెంకట్రామయ్య, ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

ఏతాదృగ్వి భవాభి రామ ..ప్రాక్తన వర్ణనీయ సుషమా రేఖను గోల్పోయిన ఆంధ్ర భూమిని గాంచి 'అనుతాప' మంది ఎదలోతులు కదిలేటట్టు రసవత్తరంగా వర్ణించారు కవి.

పాటలీపుత్రమ్ము కోటకొమ్మల మీఁదఁ
  దెలుఁగు జెండాలు నర్తించు నాఁడు
ఢిల్లీశు నెదిరి చెండిన తెల్గు విలుకాండ్రు
  నవలక్ష లోరుఁగల్ గవియు నాఁడు
రాచూరు కదనమం దేచి తల్ తెఱచుచు
  తెలుఁగు యోధుల కత్తి తిరుగు నాఁడు
అలచోళ పాండ్య సీమలఁ దెల్గు సరకార్ల
  పనుపు సూర్యాణమై ప్రాఁకు నాఁడు
చూచి సంతోష భారంబు మోచి శిరము
నూఁచు భాగ్యంబునకు నింత నోఁచలేక
యేలపుట్టితి నిపు డిసీ! యేటి బ్రతుకు
కటకటా దాఁటిపోయె బంగారుయుగము'

అయినా నిరాశ చెందక వగవక దీక్షతో ప్రత్యేక రాష్ట్ర సంపాదనకు కడంగుమని ప్రబోధించుచున్నారు.

'దీక్షాకంకణమున్ ధరించి జనయి
  త్రీ దాస్య విచ్ఛేదనా
పేక్షల్ పొంపిరివోవ ముజ్జగము కం
  పింపంగ లేలెండు మీ
దక్షత్వంబున కడ్డులేదు చరితా
  ర్థత్వంబు మీ కబ్బునే
పక్షుల్ గూసిన నేమి లెక్క కడిమిన్
  పాలింపుడీ సోదరుల్'

విఘ్నాలెన్ని వచ్చినను, నా రాష్ట్రం గడించి తీరుతానే వజ్ర సంకల్పంతో బయలు దేరితే బ్రహ్మరుద్రాదులు కూడ ఆపలేరు. ఒడ్డెలను కొండవీటి దగ్గర జయించి, రాయచూరులో పాదుషాలను కకావికలం చేసిన సందర్భం గుర్తుకు తెచ్చుకొని సాగిపొండు, నాడే కాదు! నేడును ఆంధ్రుల్లో రాణకెక్కినవారు పల్వురున్నారు. వారి నేతృత్వమే మనకు అనుసరణీయమంటున్నారు.

'పోలివోవలేదు తెల్గుల పరాక్రమరేఖ
  మన 'టంగుటూరి' లో మల్లడించె,
సడలలేదాంధ్ర విజ్ఞాన తేజఃపుంజ
  మది రామలింగార్యు నాశ్రయించె,
చెదరిపోలేదాంధ్ర శేముషీ సంపత్తి
  పట్టాభి సచివు కేల్ పట్టుకొనియె,
బీఱువోలే దాంధ్ర వీర దాతృత్వంబు
  నాగేశ్వరునిలోఁ బెనంగియుండె
తఱిగిపోలేదు తెల్గుకైతల పసందు
కులుకు చున్నది చెళపిళ్ళ కలమునందు
నిస్పృహకు హేతువించుకేనియును లేదు
సోదరా! లెమ్ము నీ హక్కు లాదుకొమ్ము'

నాడు రాజకీయ రంగంలో ప్రసిద్ధిగన్న టంగుటూరి ప్రకాశంపంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగార్లను ప్రస్తావించి, వారి సారథ్యంలో ప్రత్యేకాంధ్రరాష్ట్రం తప్పక సిద్ధిస్తుందని కవి సూచిస్తున్నాడు.

ఇక్కడనుండి సంస్కరణము, పశ్చిమాంధ్రులు, మాతృభాష అను శీర్షికల్లోని పద్యాల్లో నేడు ఆంధ్రుల్లోగల లోపాలను, వానివలన ఉద్యమకాలంలో ఎదురైన సాధక బాలకాలను ప్రస్ఫుటంగా ఎత్తి చూపారు. పొగడ్త ఎంత ఉత్సాహంతో నడచిందో, తెగడ్తయు అంత తీవ్రత నింపుకొన్నది. వీరి లేఖినిలో దోష మెక్కడున్నా దోషమే మరి కుల మత భేదమ్ములు సమసిననే కాని అక్ష్య సిద్ధి జరగదంటూ వారు చేసిన యీ ప్రబోధము గమనింపుడు.

'వైదికులన్నచో మొగము
  వాడ్చునొకండు నియోగి భోగముల్
ఖేదము గూర్చునొక్కనికి
  గిట్టదు గిట్టదు కమ్మవారి భా
గ్యోదయ మెల్లవారలకు
  నోర్వఁడు రెడ్లయశం బొకండు స
మ్మోదము నీదు కాఁపుల స
  మున్నతి యొక్కనికేమి పాపమో!"

నేటికి గూడ ఈ విషయం సజీవమై యుండుట ఆంధ్రుల అల్పత్వమునకు నిదర్శనమేమో!

ఇక "పశ్చిమాంధ్రులు" ఖండిక రాష్ట్రగానానికే తలమానికము. పశ్చిమాంధ్రులు తమ భూభాగమునే రాయలసీమ యన్నపుడు; సాగరాంధ్రులపై శంక కొలది ఆదోనిలో సమావేశమై ప్రత్యేక రాష్ట్ర వాంఛ వెలిబుచ్చినపుడు; కవి హృదయం పొందిన క్షోభ ఈ పద్యాల్లో వ్యక్తము. మహోద్రేకంతో సాగినది రచన యీ ఘట్టములో. త్రిలింగదేశమంతటిని ఏకచ్ఛత్రముగా పాలించినవాడు కృష్ణదేవరాయలు. అట్టిచో ఆంధ్రదేశములోని యేకభాగమగు దత్త మండలమునే 'రాయలసీమ' గా వ్యవహరించుట తప్పని కవి అభిమతము.

"కటకం బాదిగ సింహళంబు వఱకే
  కచ్ఛత్రమై సత్కవి
స్ఫుట వాణీపరిగీతమై పరనృప
  భ్రూభంగ సంపాదియై
పటు కీర్తిం గనినట్టి రాజ్యముఁ గదా
  పాలించె నాయండు మీ
నటనల్ గన్గొని పల్లటిల్లి యతఁ డ
  న్నా సిగ్గునన్ గ్రుంగడే"

అంతేకాదు - సాగరాంధ్రులపై రాయలసీమవారికి అనుమానము వల దని వ్రాసిన పద్యాలు కవి హృదయ వైశాల్యానికి, పరేంగితజ్ఞతకు నిదర్శనములు.

"మీకున్ మాకును లేవు భేదములు దు
  ర్మేధావు లాంధ్రేతరుల్
మాకున్ మీకును తంపిపెట్టి బ్రదుకన్
  మల్లాడుచున్నారు; మీ

రా కుక్షింభరులన్ త్యజించి యుచిత
  వ్యాపార పారీణులై
లోకుల్ తెల్గుల నుగ్గడించు విధ మా
  లోచింపుడీ ప్రముక్కదన్''

ఈ రీతిగ అందరు కలసికట్టై "అచ్చముగఁ దల్లి కడుపునఁ జిచ్చున్ దరికొల్పునట్టి చేతలు కల, దేహాచ్చ్యంబులేదు మాదెస" అని నచ్చచెప్ప ప్రయత్నిస్తారు.

కాగా 'మాతృభాష' ఖండిక తెలుగు వారికి భాషపైఁగల అనాదరమునకు, అవజ్ఞతకు నిదర్శనముగా కవిగారు తీర్చిదిద్దిరి 'Italian of the East' అని పాశ్చాత్య విద్వాంసుల చేతను 'దేశభాషలందు తెలుఁగు లెస్స' అని మనవారిచేతను కీర్తింపబడిన తెలుగునకు బట్టిన దురవస్థ చూచి కవి వ్యథకులోనై-

'ఇద్దరు తెల్గువాండ్రు తమ
  యింటివి కష్ట సుఖాలు చెప్పుకో
నద్దిర మాతృభాష తగ
  దా మరి యింకొక పెద్దరోగమే
కద్దు వచింతు నాంగ్లము మొ
  గంబు నెఱుంగని శ్రోతముందు దు
ర్బుద్ధులు కూయుచుండ్రు పలు
  పోకల నెంగిలి పీసు కూతలన్'

నాఁడే కాదు, నేటికిగూడ ఈ పరిస్థితిలో మార్పు లేదనుట 'సహృదయు' లెఱిగిన విషయమే. ఇంకా తెలుగువాడిలోని ఆంధ్రత్వ అనాదరణను ఎలా దుయ్యబడుతున్నారో చూడుడు కవి.

'పోతన్న కలము సొంపుల నెఱుంగక మున్నె
  తులసిదాసుని కైతలోఁ బనేమి
బొబ్బిలి కథలోని దెబ్బ చూడక మున్నె
  మేవాడ పతనంబు మెచ్చనేల
రాజశేఖర చరిత్రము పఠింపక మున్నె
  రంగభూమికి జయారావమేల
పూదండ సౌరభంబులు పీల్వకయె మున్నె
  సప్త సరోజకై శ్రమ మదేల
కోర్కెమై నొక్క భారతిం గొనక మున్నె
కాన్కలేటికి మాధురీ కరుణ కొలకు
పైత్య మెసరేగి కంటికి భ్రమలు గ్రమ్మి
దిక్కు తెలియక యున్నాడు తెలుగువాడు'

తెలుగు తీరు తీయములు నిగ్గుజగ్గులు చూచి బ్రహ్మరథంపట్టిన బ్రౌనుని; తీవి, హొయలు, బెడగులు చూచి మెచ్చి కాన్కలిచ్చిన మహమ్మదీయ ప్రభువు ఇబ్రహీంని; సొంపు, పెంపులు ఒయారములు నెరిగి పరిచర్యలు సలిపిన మహారాష్ట్రుడు కామాక్షిని; తేటపాట నటుల దిలకించి దాసులైన అరవల్ని; గుర్తుచేసి అలా పరులచేతనే ప్రస్తుతింపబడిన తెలుగుపట్ల చిన్నచూపు చూపుట ఆంధ్రుల అజ్ఞతకు ఆద్య నిదర్శన మంటున్నారు కవిగారు. 'తెలుఁగుఁ దనము' అనే మరో శీర్షికలో-

'అస్పృశ్యములు నీకు నాంధ్రపత్రిక లెల్ల
  నింటి వేల్పులు టైము, హిందు, మెయిలు
నలసారములు గదా తెలుఁగు మందులు నీకు
  జండుఫార్మసి సుధాసాగరంబు
కలకు బండలు భద్రగిరి, తిర్మలలు నీకుఁ
  బండరి క్షేత్రంబు పరమపదము
పరిహాస్యములు నీకు బాలమ్మ చరితముల్
  శరణంబు కుసుమాంబ చరణపీఠి
చవితిచంద్రుఁడు తెలుఁగు పుస్తకము నీకు
విదియజాబిల్లి హిందీకవి ప్రబంధ
మక్కటా! యేలపుట్టె నీ కక్కుమూతి
పిందియలు నీకు నంచితాస్పందమతికి'

అంటూ ఆంధ్రుణ్ణి ఎత్తిపొడుస్తున్నారు. ఇందు తుమ్మలవారి ఆంధ్రాభిమానంగాక అభిమానాతిరేకం (దురభిమానం) కన్పట్టుతోందని విమర్శకుల అభిమతం. కాని ఇక్కడ ఒక్క విషయం గుర్తించాలి. కావ్యం ఏ పరిస్థితుల్లో ఆవిర్భవించింది? దానికి నైపథ్యం ఏమిటి? అన్నది ఆలోచించాలి. ఉద్యమం తీవ్రదశలో ఉన్నపుడు, ఆ ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధం [illegible] చిన కావ్యమిది. అందుకే భావనలో ఆ తీవ్రత కన్పట్టుతోంది. ఆ తీవ్రతే ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసేది. అది లేనప్పుడు కావ్యరచనా ప్రయోజనమే లోపిస్తుంది మరి! అందువలననే ఈ అభిమానాతిరేకం కూడ సమర్థనీయమే అనిపిస్తుంది.

ఎంతచిత్తశుద్ధితో కృషిచేసినను నేదో ఆటంకము ఉద్యమాన్ని బలహీనపర్చేది. 'కొందరు' అడ్డుపడేవారు. వారిపై కవి మందలింపు-

ఒక 'యంబ్రహ్మ' తెలుంగురాష్ట్రమునకే
  దో 'పంథకోణంబు' నేఁ
తకునై యొగ్గర మొడ్డినాడని మహో
  దగ్రక్షుధావిభ్రమద్
భుపటిం బాపఁగ నేల గ్రద్దుతిమిగం
  తుల్వెట్టఁగా నేల కా
ర్యకళాభిజ్ఞుల కేల పిచ్చుకపయిన్
  బ్రహ్మాస్త్ర సంధానముల్.

ఇంతలో ఇంకో సమస్య ఎదురైనది. అప్పటి వరకు ఉమ్మడి రాష్ట్రమునకు రాజధాని మద్రాసు. తమిళులు ఈ ఉద్యమంలో ఆంధ్రులకు మద్రాసు దక్కరాదని, అంతేకాక ఆంధ్రదేశము లోని కొన్ని ప్రాంతాలు తాము కలుపుకోవాలని ప్రయత్నించి కొంత విజయం సాధించారు కూడా! దానితో మరింత ఖిన్నులై 'అలవలు' అను ఖండిక రచించారు కవిగారు.

'ఎఱుఁగుదురా? తెలుఁగుం బ్రజ
గరిమకు నది లాంఛనంబుగాఁ బెండిలిలోఁ
దురగంబు నెక్కి యలవలు
పురమేఁగుట మున్ను చెన్నపురమున
  క్రమిన్.'

అంటూ ఆంధ్రుల ఆధిక్యమును చాటిచెప్పే ప్రాచీన సంప్రదాయాన్ని గుర్తుకు దెచ్చి ఆంధ్రుల హక్కును స్థిరపరిచారు. తమిళుల సంస్కృతి వైభవానికి ఆంధ్రులే హేతుభూతులు అని విస్పష్టముగా [illegible]

వుందో,హాస్యంఅంతగా ప్రయుక్తమైనది. కవి వ్యంగ్య రచనావైభవాని కిది మచ్చుతునక.

'ఏతిమి లేదు లేదు మము
వేలుగఁ జూడకఁ దచ్చమైన మీ
కూరిమి పేరిమిం బడయఁ
గోరిన తమ్ములు మేము; మిమ్మునన్
దూలిన మాకు నిడ్డనలు
దోసెలు కాఫియు నల్లిగడ్డ సాం
బారు నొసంగి యింకెవరు
పండువు సేయఁగ నేర్తు రక్కటా'
'తరుణుల మోవి తేనియలు
త్రావక పోయిన నేమి స్వర్గపుం
బరిచితి గూర్చు సోమరస
పానము సేయక యున్న నేమి మా
కరుణగభస్తి బింబ మద
యాచల మెక్కక మున్నె వెచ్చనై
గరగర యైన కాఫీ యొక
కప్పిదిగో అని యయ్యరిచ్చినన్'

కావ్య పూర్తి యగునాటికి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం సిద్ధించలేదు. కాలక్రమేణా పర పీడన పరాయణంగా ఉన్న భారత జనయిత్రి దాస్యశృంఖలాలు ఛేదించుకొని గుండెనిండా స్వేచ్ఛావాయువులు పీల్చుకొన్నది. మహామహుల కృషి ఫలితంగా, ప్రజల అపూర్వ త్యాగాల మూలంగా ఆంధ్రరాష్ట్రం ఆవిర్భవించింది.

'రాష్ట్రగానం' తాత్కాలిక ప్రయోజనం కోసం వ్రాసిన కావ్య మనిపించినా సాహిత్య చరిత్రలో దీని స్థానం సమున్నతం. ఇది ముఖ్యంగా పూర్వాంధ్ర వైభవానికి విజ్ఞాన సర్వస్వం వంటిది.ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి, కళలు మున్నగువాని వైశిష్ట్యమును, వైలక్షణ్యమును జవము, జీవము, గల భాషలో మృదుమధుర కవితగా విన్పించిన కావ్యరాజ మిది. ఇక నాటి ఉద్యమ స్వరూపం, సమస్యలు, కళ్ళకు కట్టినట్లు వర్ణింపబడిన విందు. అందు వలన చరిత్ర దృష్ట్యా కూడ ఈ కావ్యము స్థానము గణనీయ మే.

# మౌసల పర్వము - కాలప్రభావము

- శ్రీ డా. చన్నాప్రగడ తిరుపతిరావు, ఎం.ఏ., (డబుల్) పిహెచ్.డి.

మహాభారత యుద్ధమునకు పూర్వము భారత దేశమున కంతటికిని కౌరవరాజ్యము ప్రబలమై సామ్రాజ్య పీఠమై యుండెను. యుద్ధానంతరముకూడ కౌరవరాజ్యమే సామ్రాజ్యపీఠమై యున్నను, యుద్ధమున కౌరవులందరును హతులగుటతోను, పాండవకుమారులైన యువ వీరులుకూడ హతులగుటతోను కౌరవబలము క్షీణించినది. సమ్రాట్టగు ధర్మజుడును, అతని తమ్ములును శ్రీకృష్ణుని భక్తులగుటతో కృష్ణునిదైన యాదవవంశమునకు ప్రాధాన్యము హెచ్చినది. యాదవులు కురురాజ్య ప్రజలకంటె బలసంపన్నులైరి. వారికత్తి కెదురుకత్తి లేకుండెను. దానితో వారు మదోన్మత్తులైరి. అది వారిని పూజ్యావమానమునకు పురికొల్పినది. అది వారి సర్వనాశనమునకు దారితీసినది. అత్యుచ్ఛ్రియః పతనహేతుః' అను వాక్యము యాదవులయెడ నిరూపిత మైనది. సంగ్రహముగ ఇది మౌసల పర్వపుకథ.గర్వము పతనహేతువగు ననునది ఇందలి నీతి. కాగా భారతప్రణేత యైన మహర్షి వేద వ్యాసుడు దీని కొక తాత్త్వికమైన వ్యాఖ్యానముకూడ చేసియున్నాడు. అదే కాల ప్రభావము. మౌసల పర్వమున ఆద్యంతము కాలమహిమపలుపర్యాయములు బహువిధముల ప్రపంచితమైనవి.

కాల మనగా నేమి? సూర్య, చంద్ర గ్రహ నక్షత్రాదుల గమనముచే అనుమేయమై విప్తా ఘటికా హోరా యామ దిన మాస సంవత్సరాది గణనచే పరిమేయమై,భౌతికశాస్త్రజ్ఞులచే నాల్గవకొలత (Fourth Demension) గా గుర్తింపబడిన ఒకానొక భావన. కాల మొక అవిచ్ఛిన్న మహాప్రవాహము.లోకములన్నియు ఆ ప్రవాహము వెంట కొట్టుకొని పోవుచున్నవి. దాని కెదురీదగల శక్తి ఎవరికిని లేదు. సర్వ చరాచరముల యొక్క భూత భవిష్యద్వర్తమానములను నిర్ణయించు శక్తి కాలమేఅని జ్యోతిషవేత్తలందురు. త్రిమూర్తులును, సూర్య

---

కాగా కవితా పరంగా చూస్తే ఇందలి ప్రతి పద్యం కవి ఆత్మీయతను ప్రతిబింబిస్తున్నది. తేనె తేటల నొలికించు తెలుగు నుడికారముతో, సరళ సుప్రసన్నమగు శైలితో,ఆవేశము,ఆవేదన సమ్మిశ్రమ్మైళన మంది రూపొందిన కృతి రాష్ట్రగానము, 'రవీంద్రుని వలె తన రాష్ట్రగానముచే ఆంధ్రుల చిత్తసీమను ఆంధ్ర జాతీయ పరిపక్వభావ సంస్కార బీజముల కత్తుకొన చేసిన ఆంధ్ర రాష్ట్రద్యమాభిమాని. జడుడై, నిర్జీవ ప్రతిమయై దేశభక్తి. శూన్యుడుగనున్న ఆంధ్రుని యందు నిస్ప్రాణమైయున్న దేశభక్తిని, క్షాత్రమును, విజ్ఞానమును తట్టి లేపగల ఉద్దీపితాంధ్ర శౌర్య భావనా విలసితమగు పటుతర శ్రావ్య గేయముల నలిపిన ఆంధ్ర భావోత్ఫుల్ల కవీంద్రు డితడు' అంటారు. శ్రీతుమ్మలను ప్రశంసిస్తూ దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు. (అభినవ తిక్కన కనకాభిషేక సంచిక. పు.70) ఈ పలుకులు ప్రత్యక్షర సత్యములు. ఆంధ్రుల సౌభాగ్య సౌశీల్య భావసుమపరిమళాలను తన కవితా మారుతములతో ఆకాంతముల వ్యాపింపజేసిన తుమ్మల నిజమైన, ఆంధ్రకవి. ఆయన రాష్ట్రగానము ఆంధ్ర మాతకు అమలాభరణము.

---

చంద్రులును, కాలశక్తికి లోబడిన వారే నట.

కాల శబ్దమునకు యముడు, మృత్యు, దేవత, అను అర్థములు కలవు. విశ్వరూపము ధరించిన శ్రీకృష్ణుని, 'నీ వెవరవు' అని అర్జునుడు ప్రశ్నింపగా 'కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః' లోకములను నాశనము చేయుటకై ప్రవర్ధమానుడనైన కాలుండను నేను' అని అతడు సమాధాన మొసంగెను. లోకముయొక్క క్షయమే కాక ఉత్పత్తి స్థితులు కూడ కాలాధీనములే.

'బలమును, బుద్ధియుఁ, జేఁతయు
నలఘుమతీ యుల్లసిల్లు నగు కాలమునం
బొలియుం గాల విపర్యయ
కలనంబున ... '

'కాలమూలంబు సర్వంబు' అని మౌసల పర్వాంతమున భగవంతుడైన వేదవ్యాసుడే అర్జునునకు తెలిపెను.

' ... ... ...'
గాంధారిపుత్ర శోకమునఁ జేసి
కోపంబు గదిరిన శాపంబు ముప్పది
యాఱవునేఁడెల్ల యాదవులకు
నాశ మన్యోన్య హననమునఁగుటకు నిచ్చె'

భారతయుద్ధము ముగిసిన 36 వ సంవత్సరమున యాదవవంశ వినాశన మగు నని గాంధారి శపించినది. 'అయ్యెడు వచ్చెఁ దప్ప దది ఫలించు' అని కృష్ణుఁడు భావించెను. యాదవులకు మునీశ్వరుల నపహసింపవలె నను దుర్బుద్ధి పొడమినది. 'వృష్ణి కుమారులు విధివశమున, మనముల నవినీతి జనియింప' ఇది కాల ప్రభావము, ముని శాపోపహతులైన పిమ్మట యాదవులు మత్తుగా త్రాగిరి. 'యాదవులెల్లను గాంక్షఁ బానవిధి యొనర్చిరి పెల్లుగ విధివశమున,' ఉన్నట్లుండి వారిలో నిర్ణిమిత్త జ్ఞాతికలహ మేర్పడినది. ఇది 'దయ్యము నేర్పు! యాదవులు సర్వులు హతులైరి. హత శేషులను శ్రీకృష్ణుడే స్వయముగా వధించి యాదవవంశమును నిరవశేషము గావించెను. ఇట్లు కృష్ణుడు కూడ కాలము చేతి కీలుబొమ్మ యయ్యెను. కాలమునకు సహకారి యయ్యెను. చివరకు తానుకూడ బోయవాని బాణపు వ్రేటునకు లోనగుట కాలప్రభావము గాక మరేమి?

మౌసలపర్వమున కాలము, విధి నియతి, దైవము అను పదములు పర్యాయపదములుగ ప్రయోగింపబడుట గమనింపదగి యున్నది. యాదవులకు మునులను పరిహసింపవలె నను బుద్ధి కలుగుటకు, వారు మదిరాసక్తు లగుటకు, అన్యోన్య హననమునకు పూనుకొనుటకు కారణముగా ఆయా సందర్భములందు 'విధివశమున,' 'విధివశత్వమున,' 'దయ్యము నేర్పు' 'నియతియగు నవస్థ' కాలవశమున, 'కాలవశత్వంబున, 'కాలంబగుటయు,' కాల విపర్యయంబున, 'కాల విపర్యయ మాకహిల్లుటన్, అని చెప్పబడినది. ముఖ్యముగ 'విధివశత్వంబున,' కాల వశత్వంబున,' అను ప్రయోగములు గమనింపదగినవి. అట్లే 'విధాతృచేఁత కడ్డముగలదే' విధిచేఁతకు నేరికి నడ్డపడ వశమే?' కాల పర్యయము నడుపవశమె యెవ్వరికిని; తప్పునె దైవకృత్యముల్' అను వాక్యములును గమనింపదగియున్నవి. ఇవి విధి, కాలము, దైవము ననునవి భారతకారుని దృష్టిలో సమానార్థకము లని నిరూపింపజాలి యున్నవి.

కాలశక్తి అపరిమేయము. సాధారణ ప్రాకృతమానవులైన యాదవులే కాక, భగవదవతార పురుషుడైన శ్రీకృష్ణుడు కూడ కాలప్రభావమును మీరలేకుండుట ఈమౌసల పర్వమునందలి విశేషము. 'నియత మగు నవస్థకుఁ దలపం జన దన్యథాత్వకరణము' అని కృష్ణుడు ప్రయత్నరహితుడై యూరకుండెను. కృష్ణుడు 'కాలవేది' యని మౌసలపర్వమున పలుమారులు పేర్కొనబడెను. అవశ్యంభావియైన దానిని గురించి విచారించి ప్రయోజనము లేదని అత డెరుగును. అందుచేతనే అతడు 'దివ్యదృష్టి క్రాంతి' అనియు చెప్పబడెను. శ్రీకృష్ణుని మహాపురుషత్వమునకు, దివ్యత్వమునకు ఈ కాలజ్ఞానమే నిదానము. 'కాలవిపర్యయ చలనంబున బుధుల కబ్బుఁగలకయు గలవే' 'కాలమూలంబు సర్వంబు గాన దీనికొండు తలఁపులు దక్కి మీరుత్తమంపు గతికిఁ జనుఁడు.' అని అర్జునునకు వేదవ్యాసుడు జ్ఞానోపదేశము గావించెను.

ఇచ్చట మరొక్క విశేషము. యాదవ వినాశమునకు విధి, కాలము, దైవము ఎట్లు కారణములుగ చెప్పబడినవో, అట్లే మునీంద్రుల శాపముకూడ కారణముగ పలుపర్యాయములు చెప్పబడినది. మునులను పరిహసింపవలె నను బుద్ధి యాదవులకు కలుగుటకు గాంధారి శాపము కారణము. ముసలము పుట్టుటకు మునులశాపము కారణము. వారు మదిరాపానమత్తులగుటకును, పరస్పరహననోద్యుక్తులగుటకును ఉభయుల శాపములు కారణములు. చివరకు శ్రీకృష్ణుడు క్షుద్రలుబ్ధకుని బాణపు వ్రేటునకు గురియగుటకు, అదియతని పాదమునే తూసికొని పోవుటకు పైవానితో పాటు దుర్వాసునిశాపము కారణము. 'ముని శాపశక్తి మానుపమునఁ ద్రోవఁగ రామి' 'సంయమీంద్ర శాపశక్తి నద్భుతం బందియమ్ముకుంచుడు' ఇత్యాది వాక్యములు ముని వాక్శక్తిని 'విధిశక్తితో,' 'దైవశక్తి'తో సమానార్థకముగా జేయుచున్నవి.

ఇచట కాలప్రభావమే మునులను ప్రేరేచి వారిచే ఇట్లు శాప వాక్యములు పలికించినదా, లేక మునుల శాపవాక్యములే కాలగతికి ప్రేరకములు, నియామకములు నైనవా అనునది విచారణీయాంశము మహాకవి భవభూతి వాక్యమును ఇచ్చట మనము స్మరించుట యుక్తము.

లౌకికానాం హి సాధూనా
  మర్థం వా గనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం
  వాచ మర్థోనుధావతి

లౌకికులైన సజ్జనుల వాక్కు అర్థము ననుసరించియుండును అనగా వారు సత్యవచనులై యుందురు ఆద్యులైన ఋషుల వాక్కునే అర్థ మనుసరించి వచ్చును అనగా వారు పలికినదే సత్యమగును. మహర్షుల వాక్యములును కాలగతికి సూచకములు. వారు క్రాంతదర్శనులు కదా

చివరకు తిక్కన మౌసలపర్వాంతి పద్యములలో మొదటిదానిని కాలస్వైర విహారభంజన' అని ప్రారంభించుటకూడ కాలస్వైరవిహారమే ఈ పర్వమందలి ప్రధాన విషయముగా ఆయన భావించినట్లు నిరూపించుచున్నది. తత్కాల స్వైరవిహారమునకు లీలాగృహీత మానవ శరీరధారియై భూలోకమున నడయాడుచుండువరకు పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడును బద్ధుడే దాని స్వైరవిహారమును భంజింపగలవాడు ఒక్క హరిహరనాథుడే అని తిక్కన తుది తీర్పు.

—•—

## ❋ ఆదిత్య స్తోత్రము ❋

- శ్రీ డా జొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ , పిహెచ్.డి.

* ఎవ్వఁడు లేక యివ్వసుధ యెల్ల నితాంత తమో వృతమ్మొ, యిం
కెవ్వఁడు లేక ప్రాణితతి యెల్ల నిరస్త సమస్త బోధమో,
ఎవ్వఁడు బ్రహ్మ విష్ణు పరమేశులకున్ సతతాధివాసమో,
ఎవ్వఁ డనేక సన్నృప మహీరుహ మూలమొ కొల్తు నా రవిన్

* వందారు ద్విజవర్యలోక కృత సద్భక్తిప్రణామమ్ములన్
మందేహాభిధ ఘోరరాత్రిచర సంహారంబు గా నీదు రు
గ్బృందంబున్ బ్రసరింపజేసి ఘనశక్తిం గూర్చి జీవాళి ని
స్పందేహంబుగ నోముచుండెదు జగచ్చక్షూ! నమస్కారముల్.

* ప్రత్యక్షం బగు దైవ మీవు రవి! నీ పాండిత్య మత్యంతమున్
స్తుత్యంబౌఁ గపివర్యుఁడౌ హనుమ నీతో వేదముల్ నేరిచెన్
సత్యం బీవు కృపానిధానమవు సస్యర్ధత్వముల్ మాకు నా
దిత్యా! యుష్మదధీనముల్ పరమభక్తున్ నిన్నుఁ గీర్తించెదన్

* అంతటి రాఘవుండును నిజారిని రావణుఁ జంపలేకనిన్
శ్రాంతతఁ జెంది చింతమెయి సంగరభూమి వసింపఁ గుంభజుం
డెంతయు వేడ్కతోడ వచియింప భవద్హృదయమ్ము నాతఁడున్
బంతముఁ బూని తన్మహిమ వైరిని జంపఁడె యొక్కవ్రేల్మిడిన్ ?

* ఉడిపెద వీవు చీకఁకటుల, నొక్కఁడు నీ కొమరుండు పెద్ద పే
ర్వడసిన దాత యింకొకఁడు పాపముఁ బున్నెముఁ దూఁచునట్టి ధ
ర్ముఁడు, పరమాయు విచ్చి నొకరుండు, మ ఱిర్వురు గొప్పవెజ్జు, లా
ప్పెడు సుత జీవన మ్మొసఁగుఁ, బేరు వహించెను నీదు పత్నియున్

* ఒకఁడే చక్రము తేరికి, వికలుఁడు సారథి, గుఱ్ఱాలు విషమము లయ్యున్
సకలాకాశముఁ దిరుగుదు, చకచక, నీ శక్తి కడుఁ బ్రశస్యము తరణీ!

* అనురక్తి మెఱయు సహస్రకరమ్ముల, నెవ్వాఁడు పద్మిని నవ్వఁజేయు
అమృతమ్ము హరియించు నన్యాయము సహింప, కెవ్వాఁడు రాహువు నెఱుకగతి
విశ్రాంతి యెఱుఁగక విధ్యుక్తధర్మమ్ము, నెవ్వాఁడు నిత్యమ్ము నివ్వటించు
వెన్నునకు సైత మెనఁ డొప్పఁగ నన్నగుచును, హరి సుదర్శన మయి యెవ్వఁడరులఁ గూల
మతము లన్నింటి కెవఁడు సమానుఁ డగునొ, అట్టి శ్రీసూర్యభగవంతు నభినుతింతు

* ఓ యాదిత్య దివాకరా తపన ఖద్యోతా వివస్వంతుఁడా
ఓ యుష్ణాంశుఁడ కర్మసాక్షి ద్యుమణీ యో వ్యోమనాథా హరీ
ఓయీ సూర్య అహర్పతీ దినమణీ యో పద్మినీవల్లభా
ఓ యర్కా సవితా సహస్రకిరణా యో మిత్ర ప్రద్యోతనా
ఓయీ పూష త్రయీతనూ గ్రహపతీ యో సప్తసప్తీ రవీ
ఓయీ భాస్కర అంశుమాలి అరుణా యో లోకబంధూ ఇనా
ఓయీ అర్యమ ద్వాదశాత్మ మిహిరా ఓయీ జగచ్చక్షుఁడా
ఓయీ ధామనిధీ విరోచనుఁడ భానూ చిత్రభానూ ఖగా
ఓయీ సూర వికర్తనా మనసులో నున్నట్టి చీఁకట్లనుం
బాయంద్రోలి వెలుంగఁజేయవె మహాత్మా! సూర్యనారాయణా !

# హలం పట్టినవారికోసం కలం పట్టిన 'ప్రేమ్‌చంద్'

- శ్రీ ననమాస స్వామి, ఎం. ఏ.

పూర్వమునుంచీ మన భారతదేశం వ్యావసాయిక దేశంగా ప్రసిద్ధిపొందిన కారణంగా రైతు దేశానికి వెన్నెముక అను నానుడి వచ్చింది. అట్టి రైతు మన దేశంలో ఒక సామాన్యవ్యక్తి. సామాన్య జీవితానికి కొలతబద్ద రైతుజీవితం. ఆ రైతు జీవితం ఎలా మారిందో ఆ రైతు జీవిత భూత భవిష్యద్వర్తమానాలు ఎలాంటివో గోదాన్ నవలలో సాక్షాత్కరిస్తాయి. అంతటి జీవితాత్మకమైన నవలను రచించేందుకు జీవితాన్ని ఎంతగానో కాచి తరిచాడు ప్రేమచంద్. జమీందారీవ్యవస్థకు ఆలవాలమైన మనదేశంలో అట్టడుగున బడి అన్యాయాలకు, అక్రమాలకు గురై ఆక్రందనచేసే రైతును ఆదరించని, ఆదుకోని ఆనాటి సంఘాన్ని ఎత్తిచూపి, బూజుపట్టిన భూస్వామ్యవ్యవస్థలో పడి సాలిగూళ్ళలోవలె చిక్కి చివరికి కూలి బ్రతుకే వెళ్ళబోసుకోవల్సివచ్చిన రైతు స్థితిని వాస్తవంగా చిత్రీకరించినాడు ప్రేమచంద్. రైతు గ్రామీణ జీవితానికి అడ్డుకట్టలుకట్టి నిరోధించాలని, ఊడ్చివెయ్యాలని, ప్రయత్నించే ఊరి పెత్తందార్లను గోదాన్‌లో బాగా చిత్రించాడు. జమీందార్ల, పెత్తందార్ల తొక్కిడిలో నలిగి బీదరికంతో క్రుంగుతూ చితికి మోడువారిన రైతు జీవితాన్ని యథార్థపరిస్థితుల్ని ప్రతిబింబింపజేస్తూ వారి విముక్తికై మార్గాన్వేషణ కావిస్తూ రచన గావించాడు ప్రేమచంద్. సమాజంలో నిత్యం దోపిడికి గురి అవుతున్న దీనులు, హీనులు అయిన రైతుల మూగవేదనను గోదాన్ ద్వారా నివేదించిన రైతు బాంధవుడు ప్రేమచంద్

గోదాన్‌లో ప్రధానంగా చిత్రింపబడింది సామాన్యరైతుజీవితం. సామాన్య రైతు కున్నదల్లా పంటగడ్డ అది సాగు చేసేందుకు పశువులు ఇదే జీవన గౌరవం కూడాను. సహజంగా రైతు ప్రకృతితో కలిసి మెలసి, జీవిస్తాడు. ప్రకృతివలెనే రైతు మనస్సులో కుత్సిత స్వార్థానికి తావులేదు. జన్మజన్మాంతరాలనుండి రైతు నరనరాల్లో ప్రవహిస్తున్న నీతి రైతును అన్యాయాలకు పురిగొల్పదు. న్యాయంగా ఉండడంచేతనే అన్ని కష్టాలు రైతుపాలైనా సహనంతో అనుభవిస్తాడు. మూగజీవితాలు రైతులవి. ఆ రోజుల్లో రైతు కున్న సమస్యల్లా శిస్తు ఎలా చెల్లించాలనేది. రైతును పీడిస్తున్న సమస్యల్లా ఒళ్ళు విరుచుకొని ఎంతచేసినా మిగులు కనిపించక పోవడం, చేసిన అప్పులు తీరక పోవడం. రైతును వేధిస్తున్న సమస్యల్లా వెట్టి చాకిరి ఎలా సమసిపోతుందనేది. భూస్వామ్య వ్యవస్థనుండి రైతు విముక్తి పొందేదెట్లాయనేదీ నవలలో అంతర్భాగమై యున్నది. రైతు కౌలుదారు కాకుండా తాను సేద్యం చేస్తున్న భూమికి హక్కుదారుడై, జమీందారుచే శిస్తు విధించేట్లుగాక ప్రభుత్వం శిస్తు ఏర్పరిచే విధానం ఉన్నట్లయితే నిజంగా రైతుకు జమీందార్ల ఇనుప పిడికిలినుండి బంధ విముక్తి అయ్యేది. ఆ భాగ్యాని కానాటి రైతు నోచుకోలేదేమో. అందుకే ఆమహనీయుని హృదయం తల్లడిల్లి రైతువిముక్తికోసం యెలుగెత్తి చాటాడు.

జమీందారు భూమి కంతకు హక్కుదారుడై రైతును కౌలుదారుగా నిర్ణయించేపద్ధతి ఆనాడుంది. ఈపద్ధతి వల్ల రైతు పండించిన ధాన్యంలో ఎంత తూచితూచి ఖర్చుచేసినా ఎంత పొట్టగట్టుకొని గీసిగీసి గింజ దగ్గఱనుండి జాగ్రత్తపడ్డా శిస్తు కట్టడమే గగనమౌతుండేది. ఎంత కష్టించి పనిచేసినప్పటికి కట్టుకోడానికి అతుకులేని గుడ్డ ఉండేదికాదు. రాత్రి, పగలు, అనకుండా ఒళ్ళంతా నుగ్గునూచము చేసుకొన్నా కూడా కడుపునిండా తినడమే గగ్గలమయ్యేది. రైతు జీవితంలో డబ్బు చూడడమంటే పూర్వజన్మ సుకృతంగా భావించే దినాలవి. ఎర్రని ఏగాని కూడా ఎట్లుంటుందో ఎఱుగడు రైతు. రక్తం నీరయ్యేట్లు, కండలు కరిగేటట్లు కాయకష్టం చేసిన సంపద యెఱుగని బ్రతుకు రైతుది. అయితే పొట్టకూటికే ఈ వెట్టిచాకిరి రైతు చేస్తున్నాడని మనకు విదితమౌతుంది. కటికదారిద్ర్యంతో రైతు బ్రతుకు వెళ్ళబోస్తుంటే తనకేమీ పట్టనట్టుగా నుండుటే గాకుండా శిస్తు బాకీపడివుంటే రైతుదగ్గఱకు వెట్టావానిని తోలి జులుంచేసి మరీ వసూలు చేసేవాడు జమీందారు. కడుపు కట్టుకొని శిస్తే కాకుండా మామూళ్ళు సహా సమర్పించక తప్పిందికాదు రైతుకు. ఇంత చేసినా, ఇన్నిఇబ్బందులుపడ్డప్పటికీ ఫలితమేమీ కనిపించకపోయేసరికి రైతుమనస్సు వికలమై విరక్తి భావం పొడచూపేది. కుటుంబం గడవడం కోసం చేసిన అప్పు తీర్చే మార్గం కనిపించక వారి ఆశలు అడుగంటేవి. చేసిన అప్పు చక్రవడ్డీ చమత్కారంవల్ల ఇంతింతై ఆస్తిని కాజేసేంతయ్యేది. ఈ అప్పుల బాధలు, శిస్తులబాధలు రెండూ రైతును కలచివేసేవి. ఈ రైతు బాధలన్నీ చూచిన ప్రేమచంద్ పరోక్షంగా వారి విముక్తి కోసం తాపత్రయపడి గోదాన్ రచనకు పూనుకొన్నాడని చెప్పక తప్పదు.

రైతుపడే కష్టాలకు కారణాలనేకం గోదాన్‌లో కనిపిస్తాయి పంటల ప్రసక్తి లేకుండా రైతుపై అధిక శిస్తులు వెయ్యడం, సంఘం కట్టుబాట్ల నెపంతో రైతుపై జుల్మానాలు వేయడం, చందాలు వెయ్యడం లాంటివి ప్రధానంగా కనిపిస్తాయి. శిస్తు వసూళ్ళకోనే వ్యవహారం చక్కబెట్టుకోలేని ఆనాటి జమీందారు

ఆసామీలపై జుల్మానాలు వేసి డబ్బు రాబట్టుకొనేవాడు రైతేమైనా అతనికి అనవసరం. తనకు అందేదేదో అందితే చాలు అంతా సవ్యంగా జరుగనిచ్చేవాడు. ఊరిపెద్దలేమో జమీందారు దగాదాక్షిణ్యాలతో బీదరైతులను పీల్చుకతినేవారు శిస్తువసూళ్ళ రోజుల్లో పెట్టుబడిదారులు రైతుకున్న యిబ్బందులు గమనించి ఎక్కువ వడ్డీకి అప్పిచ్చి బీద రైతులను పీల్చి పిప్పిచేసేవారు రైతు చేసే అప్పు రు. 100 అయితే నోటు, స్టాంపుల ఖర్చులని, వ్రాతకోతల ఖర్చులని, యేడాది వడ్డీ ముందే పోను 59 రూ చేతికి వచ్చేవి ఈ దోపిడికి గురౌతున్నామని తెల్సికూడా రైతు అప్పు చేసేందుకు కారణం అవి కఠిన్ని రోజులు కావడం శిస్తు చెల్లించకపోతే సాగు చేసేందుకు వీలు లేక పోవడం, మళ్ళీ సాగు చెయ్యక పోతే రైతుకు డబ్బెక్కడినుండి వస్తుందనేది కావడం. ఈ పరిస్థితుల్లో ఆపదలు గట్టెక్కేందుకు వడ్డీ వ్యాపారుల గడప తొక్కవలసిన అవసరం రైతుకు తప్పిందికాదు. అందుకే అన్ని కష్టాలు ఆనాడు రైతుల వయినవి

సుఖంగా హాయిగా మర్యాదగా రైతును బ్రతుకనీయాలని భగవంతుని కుంటే అసలు కౌలు దారుగా ఎందుకు పుట్టించి వుండేవాడు ఆలా పుట్టించినందుకే రైతుగా బ్రతికున్నంత కాలం వెట్టి తప్పిందికాదు. అయితే వెట్టి చాకిరి చెయ్యడానికి రైతు పుట్టాడని, దారిద్ర్యం పూర్వజన్మదుష్కృతి ఫలమని తలచేవారు ఆనాటిరైతులు. కాని ఇవన్నీ విధి నిర్ణయం వల్లా, పూర్వ జన్మ దుష్కర్మలవల్ల ఎప్పుడుతా యనుకోవడం పొరపాటని ప్రేమ్ చంద్ నిరసించాడు ఆనాటి రైతులు జీవిస్తున్నది బూజు పట్టిన భూస్వామ్య వ్యవస్థలో ఆనాటిదారిద్ర్యం జమీందార్ల పెత్తం దార్ల దోపిడీవల్ల ఏర్పడిందే ధన స్వామ్యంవల్లనే సృష్టి అయిందని ఆయన గోదాన్‌లో నిరూపించారు ఆనాటి సామాజికవ్యవస్థలో బీదరైతుల జీవితం ముళ్ళబాటే అయింది. వాళ్ళకు కనీసపు కోరికలు కూడా తీరేమార్గం లేదా రోజుల్లో, ఆనాటి సమాజం దోపిడికే నివాసమయింది జమీందార్ల హింసలకు, షావుకార్ల వడ్డీలకు గురై చితికిన రైతు బ్రతుకులు ప్రేమ్ చంద్ గుండెను పిండి చేశాయి సహింపరాని వేదనచే కదలి పోయిన ఆరచయిత సామాజికుల్ని కరుణార్ద్రుల్ని చేయడమే కాకుండ సమాజం కన్నులు తెరిపించాడు

న్యాయం ధర్మం ఆనాటి జమీందార్లలో కనిపించపోవడంతో నీతంటూ లేకుండా పోయింది ఆపదలోనున్న రైతుల నాదుకోవడం పోయి వారివద్ద లంచాలు తీసుకుంటారు ఏదో మడత పేచీ పెట్టి డబ్బులు గుంజుతుంటారు వీని వల్లస్థిరాస్తులు,చరాస్తులు, రైతులకు అప్పులిచ్చిన వడ్డీక్రింద జమ అయి బ్రతికినంత కాలం కూలీ నాలీ లేకుండా చాకిరీ చేయించు కొనేవారు. ఇలా రైతుల్ని దోచుకొని దోచుకొని చివరికి కూలాళ్ళని చేసేసేవారు. ఎవరికోసం వాళ్ళు రాత్రింబవళ్లు వొళ్ళు తమది కాదనుకొని కష్టపడేవారో వాళ్ళదంటూ లేక పోయేది. ఇంత దయనీయమైన బ్రతుకు రైతు వెళ్ళబోస్తుంటే చూచి నిర్వేద పడ్డాడు ప్రేమ్ చంద్ అందుకే ఆయన అట్టి సామాన్యుల గాథలు, బాధలు సామాన్య భాషలో సజీవంగా చిత్రించి రైతు ప్రగతికోసం పాటు పడేందుకు నడుంబిగించి నడిచాడు.

ఆనాటి దొరలంతా గోముఖవ్యాఘ్రాలు! ఆదొక రాబందుల గుంపు. నిరుపేద రైతు లెలాజీవితం గడుపుతున్నారో ఎలా బాధలు పడుతున్నారో వాళ్ళకు తెలియనే తెలియదు ఎవ్వడివ్ హృదయంలో కంచుకాగడా పెట్టి వెదకనా దయా దాక్షిణ్యాలు కానరావని నిర్వచించి, అట్టి కామందుల కబంధ హస్తాలనుండి రైతు విముక్తి పొందాలని అహర్నిశలు పాటు పడి వారి కోసమే చైతన్య వంతమైన రచన లొనరించి సమాజంలో చైతన్యదివిటీని వెలిగించి సామాజికుల్లో మార్పును రగిలించాడు ప్రేమ్‌చంద్. నిబద్ధత నిమగ్నత సంతరించుకున్న ఆ మహారచయిత రచించిన గోదాన్ రైతు విముక్తికి ఒక నివేదిక లాంటిది.

## ఎఱ్ఱాప్రెగడ

శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వర రావు,ఎం ఏ.

*తెనుఁగు భారత గ్రంథభామినికి శిరము
నురము నన్నయ్య కైత, బంధురనితంబ
జానుజంఘాదికము తిక్కకవికైత,
నడిమినడు మాయె ఎఱ్ఱన్న యిడిన వ్రాత.

*పరుఁడు వచించినట్టి యొక
భావనయించుక అందమైనదా
ఎతిఁగిరొయుంగనట్లు తమ
దేయని గొప్పలు చెప్పు కొంద్రు కొం
దఱుంకవు లెఱ్ఱనా! స్వలిఖి
తంబగు నట్టి యరణ్యపర్వశే
షరచన నెల్ల నన్నయ ప్ర
శస్తికిఁ జేరునకిప్పగించి ని
బ్బరముగఁ దప్పుకొంటివి, ప్ర
పంచపువాఙ్మయగాథలందు నీ
సరి కవియోగి లేఁడు గుణి
సత్తమ! అందుమ మా నమస్కృతుల్.

*నన్నయ యన్నను, తిక్కన
యన్నను, నెఱ్ఱన్న 'యెంతయభిమానము నీ
కున్నదొ నీచిఱు గంటము
చన్నపథము తెల్పుఁ దెల్గు జాతి
యొడఁదకున్.

(రాజమండ్రి హుమార్లకబ్బు యాజమాన్యమున జనవరిలో జరిగిన ఎఱ్ఱన జయంతి సందర్భమున చదివినవి.)

— • —

# స్వారోచిషమనుసంభవ సౌందర్యము

- శ్రీ ఎ. క్రిష్ణప్ప ఎం ఎ, బి ఎస్ సి

సాహిత్య సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ కవులలో నగ్రగణ్యుడు ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దనామాత్యుడు ఆంధ్ర కావ్యములలో మేటిది సాటిలేనిది పెద్దన కావ్యము 'స్వారోచిషమనుసంభవము'. హరికథాసార మను గ్రంథమును గూడ పెద్దన రచించెను ఇప్పుడది అలభ్యము. మను చరిత్ర మని స్వారోచిషమను సంభవమునకు నామాంతరము పండితులకు మను చరిత్ర మార్కండేయ పురాణోక్త ప్రకారము చెప్పినట్లు కావ్యారంభములో జెప్పుకొన్నాడు పెద్దన

పెద్దన వృత్తాంత మెక్కువగా తెలియదు. మనుచరిత్ర ఆశ్వాసాంత గద్యల వలన నీతడు నందవరపు వంశోత్తముడనియు, చొక్కయామాత్య పుత్రుడనియు, శఠగోపయతి శిష్యుడనియు, ఆంధ్ర కవితాపితామహుడనియు తెలియును. పెద్దన తన కవితా ప్రశంసను గూర్చి తెలుపలేదు. పెద్దన కావ్యారంభములో కాళిదాసాది సంస్కృతకవులను, ఆంధ్ర కవులలో కవిత్రయమును మాత్రము స్తుతించినాడు దీనివలన సంస్కృతకవుల గుణాలతో పాటు నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల కవిత్వలక్షణములు పెద్దన కవిత్వములో నుండ వచ్చునని యూహింప వీలగును పెద్దన మనుచరిత్రములో నన్నయ ప్రసన్నకథా కవితార్థయుక్తి, తిక్కన పాత్రచిత్రణము, ఎఱ్ఱన ఔచిత్యపోషణము మొదలగు కవితా గుణములను జూపించినాడు పెద్దన ప్రబంధలక్షణ సమన్వితమైన తన కావ్యమును 'నవీన కావ్యరచన' అని పేర్కొనెను

పంచ తంత్ర కావ్యకర్త బైచరాజు వెంకటకవి వ్రాసిన ఈక్రింది పద్యములో వలె పెద్దనకవిత్వ మిట్లుండునని తెలుసుకొనవచ్చును.

'ఘనతర ఘూర్జరీ కుచయు
గక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతి దేటగాక యర
చాటగు నాంధ్ర వధూటి చొక్కపుం
జను గవలీల గూఢతయు
జాటు తనంబును లేక యుండ జె
ప్పిన యదపో కవిత్వ మని
పించు నగించటు గాక యుండినన్'

ఘూర్జరాంగన స్తనాలవలె పూర్తిగ దాపరికము గాక, తమిళ స్త్రీ స్తనాలవలె పూర్తిగ కనబడు రీతిగాక, ఆంధ్ర స్త్రీ స్తనాలవలె అరచాటుగ నుండుట కవిత్వము అనగా పెద్దనకవిత్వము పూర్తిగ గూఢమును గాక, పూర్తిగ బహిర్గతమును గాక, బాహ్యాంతర్గత భావ మిళితమైనది మను చరిత్రములో నీగుణ మెల్లెడల కానవగును.

స్వారోచిష మనుసంభవము బహునాయకాశ్రయమై వస్త్వైక్యము పొందలేదను సందేహము కలుగును ప్రవరుడు స్వరోచి, మనువు ఇందలి నాయకులు. తీర్థసందర్శనాభిలాషియైన ప్రవరుడు సిద్ధుని పాదలేప మహిమతో హిమవంతమును దర్శించి, పాదలేపము మంచులో కరిగి తిరుగుప్రయాణము చేయలేక వరూథినిని దారి యడుగ కామప్రేరితయైన వరూథిని ప్రవరుని కౌగిలింప, ప్రవరుడామెను త్రోచివైచి, అగ్నిదేవుని ప్రార్థించి తనపురము చేరుకొనెను. గంధర్వుడు మాయా ప్రవర రూపధారియై వరూథినిని రమించెను. మాయాప్రవర వరూథినులకు స్వరోచి జన్మించెను స్వరోచి మనోరమ, విభావసి, కళావతి యను మువ్వురను వివాహమాడెను. వారి యందుమువ్వురు కుమారులను బడసెను స్వరోచి వేటకై వెళ్ళి లేడికోరికపై ఆలింగనము గావించు నది వనదేవత గామారెను. వనదేవత కోరికపై స్వరోచి యామెయందొక మనువును బొంది దే స్వారోచిషమనువు ఇది స బన యితివృత్తము పెద్దన ప్రవర వరూథినుల ఘట్టమును వివరించి, స్వరోచి చరిత్రను విస్తృతపరచి మనువును గూర్చి సంక్షిప్తముగ ముగించెను. మనువునకు బూర్వచరిత్రమే చెప్పబడినది. పెద్దన యీ గ్రంథమునకు బెట్టిన పేరు 'స్వారోచిషమనుసంభవము పెద్దనను 'స్వారోచిషమనుసంభవ మఱియు వ్రాయు'మన్నాడు శ్రీకృష్ణదేవరాయలు. షష్ఠాశ్వాసాంత పద్యములో 'కోరిన నీ స్వారోచిషు చారిత్రము వినిన' అనియు, ఆశ్వాసాంత గద్యలలో 'స్వారోచిష మనుసంభవమనియు పెద్దన వేసికొన్నాడు కాబట్టి వస్త్వైక్యము కుదిరినది

పెద్దన పాత్ర చిత్రణములో జూపిన నేర్పు అద్వితీయమైనది. ఈతని పాత్రలలో ప్రధానమైన ప్రవరుని పాత్రలో లీనమై తనఆత్మీయతా ముద్రను బ్రదర్శించినాడు. పెద్దన పాత్రలను బ్రవేశ పెట్టినప్పుడే ఆయా పాత్రల గుణ సౌందర్యములు కళ్ళకు గట్టినట్లు ప్రదర్శించును ప్రవరుడు 'మకరాంక' శశాంక మనోజ్ఞమూర్తి' 'వివిధాధ్వరనిర్మలకర్మదీక్షాపరతంత్రుడు' వరూథిని ప్రవరుని గాంచినప్పుడు 'కోరికల్ గుబ్బటిలంగ' చూచినట్లు చెప్పెను గంధర్వుని కపట భూసురునిగా చిత్రీకరించెను స్వరోచిని 'శశిభాస్కర పావక తారకా ప్రకాశముగా చూపెను మనోరమను భయశోకంబుల వెక్కుచు మెయిగల విలాస విభవ లక్ష్మి దక్కుట యను నొకయొఱపై నెక్కొను' విధముగ చూపినాడు మనువు పాత్రను బ్రవేశ పెట్టినప్పుడు 'శాంతిదాంతి దయా సత్యశౌచ నిరతుడైనట్లు చిత్రించెను గంధర్వుడు మాయా ప్రవరరూపములో వచ్చి మోసగించినట్లు వరూథినికి తెలియదు. వరూథిని మనసులో ప్రవరుని రూపము శాశ్వతముద్ర వేసుకున్నది

అందుకే ప్రవరునిరూపరేఖలు స్వరోచిలో కన్పట్టును. ప్రవరుని గుణాలతో పాటు సౌందర్యమును గూడ మనువులో పెద్దన చూపెను.

పెద్దన జరుగబోవు సన్నివేశమును గూర్చి ధ్వని ప్రాయముగా చూపించుచు ప్రవరుని గుణమును గూర్చి

'వాని చక్కదనము వైరాగ్యమున జేసి
కాంతఁ జేరము జారకామినులకు
భోగ బాహ్య మయ్యె బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకు బోలె'
[1-52]

అని చెప్పెను. ప్రవరుని చక్కదనమునకు వలచి వచ్చిన జారకామినులు అతని జేర నసాధ్య మయ్యెను. ఇది ప్రవరుని సౌందర్యమునకు ముగ్ధురాలైన వరూథిని వలచి కౌగిలింపగా ప్రవరుడు 'హా శ్రీహరీ యంచున్ బ్రాహ్మణుడోరమోమిడితదీయాంసద్వయం బంటి పొమ్మంచున్ ద్రోచె' నను సన్నివేశమును ధ్వనింప జేయుచున్నది.

అట్లే స్వరోచి చేత ఇందవరాక్షునకు శాపవిమోచన మైన పిదప చీకటి వర్ణన మిట్లున్నది.

'తమ తమ కాలాహి ప్రపం
చము నెరగోని రౌద్రవధీశ సద్యఃకృతదం
డమున మగుడంగ గ్రక్కెడు
క్రమమున. వెయ్యియ్య విచ్చి కడలకు
దొలగెన్' [3-56]

నల్లత్రాచు కప్పలు మొదలగు వానిని మ్రింగినట్లు భూలోకము నంతను చీకటి గ్రమ్ముకొనెను. వెంటనే ఔషధశక్తి తెలిసిన వైద్యుడు తిన్న యెరను గ్రక్కించినట్లు చంద్రు డుదయింపగన్ చీకటి పొరలు విడిచి దిగంతములకు బోయెను. ఇక్కడ స్వరోచి మనోరమాది భార్యలతో సంసారపు చీకటిలో మునుగువట్లు వనదేవత ప్రవేశముతో సంసారపు చీకటి పొరలు విడిచి కథ చివరి మలుపు తిరుగుటను ధ్వనింప జేయు చున్నది.

కావ్యారంభ పద్యము నందు కూడ పెద్దన చాల భావ్యర్థములు ధ్వనింప జేసినాడు.

'శ్రీవక్షోజ కురంగ నాభ మెదపై
జెన్నొంద విశ్వంభరా
దేవిం దక్కమలా సమీపమున బ్రీ
తిన్నిల్పినాడో యనం
గా వందారు సనందనాది నిజ భ
క్త శ్రేణికిం దోచు రా
జీవాక్షుం డు కృతార్థ జేయు శుభ దృ
ష్టిం గృష్ణ రాయాధిపున్' [1-1]

విష్ణువు లక్ష్మిని గాఢముగ కౌగలింపగా నామె వక్షోజము మీది కస్తూరి విష్ణువు ఎదపై నంటుకొని భూదేవి వలె నగపడగా లక్ష్మితో పాటు భూదేవిని గూడ తన వక్షమునందు ప్రేమచే దాల్చినాడే మోయని సనందనాది భక్తులకు దోచు శ్రీ విష్ణువు శుభమగు తన చూపు చేత కృష్ణదేవరాయలను కృతకృత్యుం జేయు గాక! స్వరోచి లేడిని కౌగలింప భూదేవిలా కన్పడుట వలన కావ్యము శాంత రస ప్రధానమని భావింపవచ్చును. భూదేవి శాంతమూర్తి. ఓరిమికి మారుపేరు. వరూథినీ ప్రవరుల కౌగిలింత కథకు మూలము కాగా, స్వరోచీమనోరమల కౌగిలింత కథకు కాయువుపట్టు కాగా, స్వరోచీ వనదేవతల కౌగిలింతతో కథ ముగియును.

పెద్దన కవిత్వము హృద్య పద్య భావ బంధురము. ఐరావతము నెక్కి యేగుచున్న స్వరోచిని పురస్త్రీలు వేడుకతో చూచిరి. ఒక స్నానమాడుచున్న స్త్రీ వచ్చి స్వరోచిని చూచిన తీరు నీ విధముగ వర్ణించినాడు పెద్దన.

'జిలుగుల బెట్టుచుం దొరల
జెంగిలి పావడ యంటి మైతడిం
బెళబెళ లేని చీర గటి
బింకపు చన్నుల జేర్చి కొంచు వే
జలకములాడి యాడి యొక
చానకర స్థిత కేశయై నృపు
న్వెలువడి చూచె లో పడితి
నీకని బాసకు నిల్చెనో యనన్'[5-68]

ఒక స్త్రీ స్నానము చేసి మేని తడి యొత్తుకొను నవకాశము లేక తుడుచుకొనదగు సన్నని బట్టలను బిగి సడలిన పైటకొంగును నడుమునందును, బింకమగు స్తనములందు నొకచేత గూర్చి పట్టుకొని రెండవ చేత దడిసి నీరు గారుచున్న జుట్టును బట్టుకొని యటకు వచ్చి వశమైతి నని శపథము చేయుటకై నిలచినదా యనినట్లు నిలచి రాజును చూచెను. ఈ వర్ణనమున చిత్రలేఖకునకు కూడ సాధ్యపడని విధముగ మన హృదయ ఫలకము మీద మరువరాని ముద్ర వేసి వేడుక కలిగించినాడు పెద్దన. ఇంతకంటె రమ్యమైన భావము మరొకటి లేదనిపించును.

ఆశ్లేష మాత్రా ప్రవరుడు తన యూరికి వెడలెద నని చెప్పగా విసిన వరూథిని విలపించిన తీరును మనోహరముగ వర్ణించినాడు పెద్దన.

'అనినం జిత్తము జల్లనన్ సొరుగుచు న
య్యంభోజ పత్రాక్షి లో
చన గోళంబుల జిమ్ములై చిలుపలై
జాలై తరంగంబులై
చను దోయిం గొనబౌ కురంగ మద చ
ర్చల్ జాతి పో నుక్కు మెం
డున బాష్పాంబు ఝరంబు లుప్పతిలె బో
టుంబాటుగా నెంతయున్' [6-25]

వరూథిని గుండె జల్లనగా కన్నులలో ముందుగా జిమ్ములుగా బొడమిన కన్నీరు చిలుపలై, జాలై, తరంగములై, మహా ప్రవాహమై పాటు పోటును బోలి ప్రవహించు చున్నది. కన్నీరును వర్షము కచ్చుచున్నదా యన్నట్లు తలపింప జేసినాడు.

పెద్దన కవిత్వము రమణీయమై, రసవంతమై మనోజ్ఞ మంజుల భావ రంజకమై యొప్పారు చున్నది. పెద్దన కృష్ణదేవరాయ లన్నట్లు చెప్పిన

'హితుడవు చతుర వచో నిధి
వతుల పురాణాగ మేతిహాస కథార్థ
స్మృతి యుతుడ వాంధ్ర కవితా
పితామహుండ వెవ్వరీడు పేర్కొన
నీకున్' [1-15]

అను ప్రశంస, కవి చౌడప్ప చెప్పిన 'పెద్దన వలె కృతి చెప్పిన పెద్దన వలె' అను ప్రశంసు అత్యుక్తులు కానేరవు!

# భజే కృష్ణవేణీమ్

(కృష్ణవేణీ స్తుతి)

- అభినవ కాళిదాస శ్రీ తెల్కపల్లి
రామచంద్రశాస్త్రి

*చలద్రంగదుత్తుంగ భంగాభిరామాం
పథ స్సంభవాం పశ్చిమాద్ర్యంతరస్థాత్।
సరన్తీం ధ్వనన్తీం యథా సామగానం
దధానాం పవిత్రాం భజే కృష్ణవేణీమ్॥

*సమప్రాణినాం క్షుత్పిపాసోపశాన్తిం
విధాతుం నదీర్ణాం జగత్యాం పయోభిః।
సమస్తాని సస్యాని మాతేవ పాన్తీం
అనర్ఘ్యార్ఘ్యభిగమ్యాం భజే కృష్ణవేణీమ్॥

*జయారంభ భేరీధ్వనిం సాగరం స్వం
ప్రియం సత్వరం సానురాగం వ్రజన్తీం
స్వమార్గాన్తర గ్రామవల్లీ గతాభిః
కృతస్నాన సంశుద్ధహృద్భి స్సతీభి॥

*హారిద్రాపరాగాక్షతై ర్గన్ధపుష్పైః
ఫలై ర్నారికేళైః కృతం భవ్యమర్ఘ్యం
గృహీత్వా విభాన్తీం భుజంగ ప్రయాతాం
ఘనిం మంగళానాం భజే కృష్ణవేణీమ్॥

*అసచ్చారదవ్యోమ్ని తారాన్తరోత్థాం
సితాం పద్ధతిం వా లసన్తీం రసాయామ్।
మునీన్ద్రై స్తపస్యారతై స్సేవ్యమానాం
మహిమ్నాం నిధానం భజే కృష్ణవేణీమ్॥

*క్వచిద్గంధ శైలాధిరోహావరోహైః
స్ఖలన్తీం లురన్తీం క్వచి త్సైకతేషు
క్వచి త్కూలమాన్మ్రాలయన్తీం సలీలం
స్వయా నావరోధం భజే కృష్ణవేణీమ్॥

* క్వచి న్నిమ్నగర్తేషు చావర్తయన్తీం
క్వచిద్భూరుహాన్ స్వైరమున్మూలయన్తీం
వినమ్రా న్క్వచి ద్వేతసా న్పాలయన్తీం
సుధాస్పర్ధినీరాం భజే కృష్ణవేణీమ్॥

* ముహుశ్శీకరాం స్త్రీగణే ప్యాకిరన్తీం
జనే షడ్గవాం సుప్రభాతానుకూలైః
ప్రబోధం నయన్తీ మివ స్వోర్మిజాలై
ర్జగత్సర్వ మేతద్భజే కృష్ణవేణీమ్॥

*క్వచి త్సజ్జతాం తుఙ్గభద్రాముఖాభి
ర్ధునీభి ర్మహాత్స్వాగతం సంవదద్భిః।
సఖీభి ర్యథా న స్తకల్లోలపూర్ణాం
నటన్తీం వదన్తీం భజే కృష్ణవేణీమ్॥

*క్షణం దర్శనా త్స్పర్శనా న్మజ్జనా ద్వా
మహాపాతకేభ్యో విముక్తిం చ మర్త్యాన్।
నయన్తీం స్థిరాం తత్పితౄ న్ముక్తికాన్తాం
మనస్తీం సదా తాం భజే కృష్ణవేణీమ్॥

*సముద్భ్యాగతాభి స్స్వసంగానురక్త్యా
సమాలింగితాం సర్వకల్యాభి రమ్యాభిః।
క్షమాం జంగమస్థావర ప్రాణిరక్షా
విధౌ జ్ఞానదాత్రీం భజే కృష్ణవేణీమ్॥

*గురౌ కన్యకారాశిగే సంప్రవృత్తే
శుభే పుష్కరే తీర్థరాజా ప్యమర్త్యైః
సమైః స్వర్గతాం కోటిశః పూజ్యమానాం
జనై రాత్మరావై శ్శుభాశీర్గిర స్తాన్॥

*ముదోద్దిశ్య చోదీరయన్తీ మివార్యాం
వసన్తే కృశాం విప్రయుక్తాం సతీం వా
శరద్యన్వహం కౌముదీం వా ప్రసన్నామ్
సదామోదదాత్రీం భజే కృష్ణవేణీమ్॥

*ఋతౌ వార్షికే భర్తృసంయోగలాభా
ప్రపూర్ణా రసై ర్మన్ద మన్దం చరన్తీమ్
గభీరాం యథా కామినీం మీనరాజిం
ప్రసజ్జాలజ్కృతాఙ్గీం భజే కృష్ణవేణీమ్॥

*అఘధ్వంసకత్వేన కృష్ణేతి రూఢా
హ్యనేకౌఘసంగాచ్చ వేణీత్య భూద్యా
సమష్ట్యోభయోః శబ్దయోః కృష్ణవేణీ
విభూతిప్రదాం తాం భజే కృష్ణవేణీమ్॥

*సతా తెల్కపల్ల్యన్వవాయేన్దునేమాం
కృతాం రామచన్ద్రేణ భక్త్యాశ్చితేన
స్తుతిం కృష్ణవేణ్యాః పఠేద్య స్త్రికాలం
స నిర్ధూత పాప్మా కృతార్థో భవేత్సః॥

# గ్రంథ సమాలోచన

## శ్రీ వాల్మీకి రామాయణము

[శ్రీవాల్మీకి రామాయణము. ఆరణ్య కిష్కింధాకాండలుగల ద్వితీయ సంపుటము. 1/4 క్రౌను సైజు. 16 + 330 పుటలు. వెల రు20. కృతికర్త: ప్రకాశకులు: బులుసు వేంకటేశ్వరులు 8-22-14 గాంధీనగరము. కాకినాడ 533004]

శతాధిక గ్రంథకర్త, ఆర్షకవిశిరోమణి, విద్వాన్ బులుసు వేంకటేశ్వర్లు శ్రీ అన్నవరం సత్యవతీదేవీ స్త్రీల ప్రభుత్వ కళాశాలాంగ్ల శాఖాధిపతి తమ నిర్వచనాధ్యాత్మ రామాయణ, నిర్వచన మహాభారత, నిర్వచన మహాభాగవత, శ్రీవేంకటేశ్వర విజయాది బృహద్గ్రంథముల మూలమున, మహర్షుల చరిత్ర మూలమున, కుందమాలా వేణీ సంహారాది నాటకాది కృతులమూలమున, పెక్కు శతకముల మూలమున, ఆంధ్ర లోకమునకు చిరపరిచితులు. గ్రంథ బాహుళ్యమున, పూర్వకవి వాక్ప్రయోగ దక్షతను, ఛందో వ్యాకరణాలంకార నియమ పరిపాలనమునను, ఇప్పుడున్న ఆంధ్రకవుల లో వీరు పేరెన్నిక గన్న వారు. ఆంగ్లభాషలో మూడు ఎం. ఏ. పట్టములంది గతముప్పది సంవత్సరముల నుండి ఆంగ్ల భాషోపన్యాసకులయ్యు తెలుగున నిర్దుష్ట కవితా కళాపారంగతులగుట మిక్కిలి విశేషము. వీరి గ్రంథము లన్నియు గ్రాంథిక భాషలోనే కలవు. వీరి గ్రంథము లన్నిటను దైవేతర విషయముల నెన్నకొనక ఆధ్యాత్మిక విషయములనే సులభసుందర సరళశైలిని వ్రాయుట వీరియందలి విశేషము.

వీ రిదివరలో బాల, అయోధ్యాకాండలు తొలిసంపుటముగా రచించి ప్రకటించిరి. అది వాల్మీకమునకు యథాతథానువాదము. ఇదియు నంతియే. ఇరువది నాలుగు వేలకు మించిన పద్యములలో శ్రీ వాల్మీకి రామాయణమును వీరు పునారచించుట, స్వయముగ ప్రకటించుట చెప్పుకొనదగిన విశేషము ఈగ్రంథమును శ్రీ వేంకటేశ్వరులు శ్రీ తిరుపతి వేంకటేశ్వరదైవమున కంకిత మిచ్చిరి. శ్రీ స్వామి వీరికి ఒక్కొక్క సంపుటమున కైదు వేల రూపాయలు ప్రసాదించి తన ప్రసాద గుణభూయిష్ఠతను వెల్లడించుటయు విశేషము. చక్కని కాగితము. చక్కని యచ్చు, ఎక్కడ ఏపుట విప్పిచూచిన శ్రీ వేంకటేశ్వరుల శైలీప్రసన్నత, మూలమందలి సొగసు చెడకీని ఉత్తమానుసరణము మిక్కిలి యాకర్షించుచున్నవి. వాల్మీకియనుష్టుప్పునకు గీత పద్యము సర్గాంతమందుగాని మధ్యమందుగాని వాల్మీకి వృత్తములకు వృత్తములు వీరు వ్రాసిరి. ఈనియమపాలనమున వీరు వాల్మీకి యడుగుజాడల నడచిరి.

ఆరణ్యకాండ పదవసర్గ 10-15 పద్యములు చూడుడు:

* దండకారణ్యమున నిండియుండి దండి
కామరూపులు నయి పనిగా గడంగి
రాక్షసులు కాలనేలను డాచుచు మము
ఘోరబాధలు పెట్టుచున్నారు రామ!

*సర్వపర్వ మహాహోమసమయముల ను
తిన్నగా వచ్చి ధర్షించుచున్నవారు
మమ్ము మిక్కిలి దుర్ధర్ష మహితబలులు
క్రూరపిహితాశనులు రక్షకూర్పు మాకు

*పరమపావనసత్తపోవరుల మమ్ము
బాధపెట్టెడు వీరల బారినుండి
మమ్ము రక్షింపనోపు సమర్థునికయి
వెదకుచున్నాము గతి నీవె వేఱులేదు.

*తలచుచో మేమె మాదగుతపముబలిమి
జంపగలము సమస్తరాక్షసచయంబు
గాని చిర సముపార్జితమైన మాత
పోధనంబు వ్యయింపంగ బోదు బుద్ధి.

*పరమ దుర్లభమౌ తపోబల ధనంబు
దాచుకొని శాపమీయక దాంతులమయి
యుంట బహువిఘ్నము లొనర్చి యుపరి
మమ్ము
జంపుకొని తినుచున్నారు సాహసులయి

*నీవు దమ్ముడు దప్పించి యావనమున
మాకు దిక్కెవ్వరును లేరు మమ్ము బ్రోవు
మయ్య! రామా! 'యటన్న ... ఈ విధముగా శైలి నడచినది. స్థాలీ భావముగ మూలము చూపనైతిని. యథామూలానుసరణ మనోహర సులభ పద గుంభన మిది. చదివిన కొలది చవులూరించు శక్తి యీశైలికి గలదు. అదే కాండ-అంతమునగల వాల్మీకి వృత్తమునకు శ్రీ వేంకటేశ్వరుల వృత్త మిది.

'అని మిథిలాధినాథతన
యామణికిన్ సతికిన్ బ్రియంబుగా
వినుతవివేకవంతు డతి
విశ్రుతు డారఘురాము డాపయిన్
జనియె సలక్ష్మణుం డమల
శౌర్యపరాక్రమ విక్రముండుచే
ధనువును దాల్చి రమ్యవినుతంబగు పావన దండకాటవిన్.

వాల్మీకి మహాకావ్య సౌరభము నించుకంతయైన జెడనీయక జాగ్రత్తగా బదిలపఱచి యింపులు సొంపులు గులుకు మృదుమధుర సులభరచనమున ఆంధ్రులకు ప్రసాదించిన శ్రీ వేంకటేశ్వరు లందరికి నభినందనీయుడు.

గీతములు వీరిచేయి యెంత తిరిగినదో వృత్తములనంతకంటె నెక్కువయే తిరిగినది. కిష్కింధాకాండ 28 సర్గ 42, 43 పద్యములు.

'నవమేఘంబుల వర్ష ధారలను
నానాపద్మకింజల్కముల్
భువిఁగూలన్ ద్యజియించి పద్మములసొం
పుంగన్న కింజల్కముల్
విపులంగాంచుకదంబపుష్పములపై
లీలన్ వెసన్ వ్రాలెడిన్
నవనూత్న ప్రియుతన్ బహుభ్రమరసం
తానంబు లున్మత్తముల్.

కరముగ జేంద్రముల్ మదముఁ
గాంచ గజేంద్రము లుబ్బనెంతయున్
వరల మృగేంద్రముల్ శ్రమముఁ
బాసిన గేంద్రము లందమందఁగా
విరమిత భండనంబునను
బెంపుగనంగ నరేంద్రమండలుల్
పరగు సురేంద్రుఁ డెంతయును
వారిదపరిక్తులతోడి క్రీడలన్.

ఇందుమూలమునందలి గజేంద్ర, గవేంద్ర, మృగేంద్ర,నగేంద్ర, నరేంద్ర, సురేంద్ర శబ్దములు వాని వన్నెవాసి మైన చెడకుండునట్లు అనువాదమునఁ జేరినవి.

మృదుమధుర శబ్దకవితతోపాటు ప్రౌఢగంభీరకవితాసంపదకూడ శ్రీవేంకటేశ్వరులకుఁ గరతలామలకమే యనుటకొండు ఉదాహరణము.

'ఘనసత్తచ్ఛద పాదపప్రచురశా
ఖాజాలమందున్ నితాం
తనిశానాథమహార్కతారకలసొం
దర్యంబునందున్ మహా
వనమత్తేభ విచిత్రలీలలను బ్ర
వ్యక్తంబుగా స్వీయశో
భను భాగించి యొసంగి పెంపుగనెడిన్.
భాస్వచ్ఛరత్తియెడన్.

ఇట్లెన్నేని చూపుచుఁ బోవచ్చును. ఈవిధముగా మఱియొక మహోన్నతాంధ్రీకృత వాల్మీకి రామాయణము తెలుఁగు సరస్వతి కంఠాభరణమగుట ముదావహము. శ్రీవేంకటేశ్వరుల రామాయణ సుందరకాండ యుద్ధకాండముల శుభాగమనమునకు నిరీక్షింతము.

—•••—

## శ్రీ దేవీ భాగవతము

(శ్రీదేవీభాగవతము- ప్రథమ సంపుటము. ౧-౪ స్కంధములు. రచన: బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ; 8-42-14 గాంధీనగరం, కాకినాడ 53304. 14+305 పుటలు 1/4 క్రౌను. వెల రు 20.)

శ్రీ వేదవ్యాస ప్రణీతమగు సంస్కృత దేవీభాగవతమున కిది పద్యాంధ్రీకృతి. ఇది ఒకటి నుండి నాలుగవ స్కంధము తుదదాక కల తొలిసంపుటము. ఇది యిదివరకెవరో వ్రాసిరే? మరల నేల వ్రాయుట అన్న 'పరులు రచించినారనుచ భవ్యకృతుల్ సుకవుల్ త్యజించిపోదురె రసహీనగాథలకు? బహుసుందర దివ్య పురాణకావ్యముల్, పరగవె నిత్యనూతనత వానికిఁ బ్రాఁతయు రోఁత యుండునే?' అని చక్కని సమాధానము.

దేవీ భాగవతమునే శివభాగవతమని భగవతి యనియందురు. ఇది 'సర్వచైతన్యరూపాంతాం ఆద్యాం విద్యాంచధీమహి బుద్ధిం యా నఃప్రచోదయాత్' అను సుభాషితముతో నారంభమైనది. వీరి యనువాదము :

శ్రీచైతన్యమయ స్వరూపమగుచున్
శ్రేష్ఠంబుగా నన్నిటన్
దోచంగాంచుచు నాత్మగా మఱియు నెం
దున్ విద్యనా నాద్యనా
వాచాగోచరమై మనస్సున కెటుల్
స్వాధీనమే కాక ప్రే
రేచున్ బుద్ధిని నాత్మరూపమును గీ
ర్తింతున్ సదా ధ్యానినై.

ఇదే భావము వీరి యవతారిక 3 వపద్యములో చెప్పినారు:

'సకల చరాచరాత్మక వి
శాలజగజ్జయ సృష్టిభూతఁ
టికిఁగల దేహముల్ కడుఁ బ
టిష్ఠ మొనర్చుచు నన్నిటం గడున్
వికలత లేని యాత్మవయి
వెల్గు చునుండువు నీవు బ్రహ్మవి
ద్యకుమఱియాద్య విద్యకును
నంచితధామము జీవశక్తివై.

ఈయనకు ఆత్మ విశ్వాసము, అద్వితీయ దేవీభక్తి మిక్కిలి కల వనుటకు :

'కల దవ్యాజ భవత్కటాక్షసుధ త్వ
త్కల్యాణ గాథాసుధా
విలసద్వార్థిని నోలలాడెదను దే
వీ! జన్మ ధన్యంబుగా ...' అన్న వీరే
'రమ్మ; మదీయలేఖినిని
రమ్యహృదిన్ భవదిష్టసిద్ధిగా
నెమ్మిని నిల్చి నీకృతిని
నీవె రచింపఁగఁ జేసికోఁగదే.
అని ఆత్మసమర్పణము చేసినారు.మఱియు

'నిర్వచనంబుగా నిటు ల
నిర్వచనీయ సమస్తశక్తివై
సర్వము నిర్వహించెడి ప్ర
శస్తచిదాత్మవు నీవె నేత్రయు
క్పర్వముగాఁ గనంబడుచు
భవ్యమనోజ్ఞ రసోచితంబు నీ
సర్వచరిత్రఁ దెల్పెడు య
శంబునొసంగి యనుగ్రహింపుమా'
అని దేవిని ప్రార్థించారు.

(తరువాయి 21 వ పేజీలో)

# ఈ పక్షంలో

గ్రంథ ఆవిష్కరణ –

మయూరి కళాసమితి

ఈ మార్చి 4 తేదీ బుధవారం సాయంకాలం 6 గం॥లకు రాజమండ్రి శ్రీ వేంకటేశ్వర ఆనం కళాకేంద్రంలో కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు శ్రీ యస్. రామాచారి అధ్యక్షతను మహాసభ జరిగినది. ప్రముఖజర్నలిస్టు శ్రీ గుడిపాటి శ్రీహరి కృష్ణ గ్రథితమైన 'సాయి తత్త్వము' అను గ్రంథమును సుప్రసిద్ధ కవి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఆవిష్కరిస్తూ షణ్ముఖమూర్తియైన గ్రంథము మయూరకళాసమితి వారిచే శివరాత్రి నాడు ఆవిష్కరింపబడడం విశేషం అంటూ పీఠికలో తాము వ్రాసిన గ్రంథ ప్రాశస్త్యమును గూర్చిన అంశములను విపులీకరించారు. అధ్యక్షులు గ్రంథపరమార్థమును రచనారీతిని ప్రశంసించారు. గ్రంథకర్త నూతన వస్త్రములతో శ్రీ సత్యనారాయణశాస్త్రి గారిని సత్కరించారు. కళాసమితి వ్యవస్థాపకులు మయూరి కళాసమితి ఆవిర్భావమును గురించి పరిచయపు మాటలను పలికారు. నాట్యాది కళలను ఆదరించి ప్రోత్సహించుట కళాసమితి ఆశయమన్నారు.

కళాసమితికి, సాయితత్త్వానికి, సంబంధమేమి? వాహ్యావాహన సంబంధమేనా అనిపించింది. కాని కళారాధన భగవత్కైంకర్యమే ప్రధానలక్ష్యం అగుట సాయితత్త్వం భగవద్గుణమహిమాతిశయమును వివరించునది యగుట నివి పరస్పర సమన్వితము లని భావింపవచ్చును.

సభానంతరము చి॥ పానుగంటి పద్మ, కృష్ణజ్యోతి, బి. అనిత అను బాలికలు మువ్వురూ చక్కని నృత్యప్రదర్శన మిచ్చి సదస్యుల నానంద పరచి ప్రశంసల నందిరి.

కాలేజీ సాంస్కృతిక సభ

అయిదురోజుల వార్షికోత్సవములలో భాగముగా రాజమండ్రి వి. టి. కాలేజీ కల్చరల్ డే 11-3-81 తేదీని సాయంకాలం గం 6 లకు కాలేజీ ఆవరణములో జరిగినది. సభకు నవభారతి గురుకులవ్యవస్థాపకులు, మాజీ ఎం. ఎల్. సి, శ్రీ తన్నీరు బుల్లెయ్యగారు ఎం. ఏ., బి.ఇడి. అధ్యక్షత వహించిరి. ప్రాచీన సంస్కృతి పునరుద్ధరణ చేసి దానిని నిలుపుకొనవలసిన ఆవశ్యకతను గూర్చి వివరించిరి. వి. టి. కళాశాల అభివృద్ధిని కాంక్షించిరి. కళాశాల కమిటీ అధ్యక్షులు, జాతీయ నాయకులు అయిన శ్రీ క్రొవ్విడి లింగరాజు గారు, కళాశాల కమిటీ కార్యదర్శి శ్రీ పి. వి. చలపతిరావు గారు కళాశాలాభివృద్ధికి విశాల నూతన భవన నిర్మాణానికి తాము చేయుచున్న కృషిని వివరించి యందరి సహకారమును అర్థించిరి. కమిటీ కార్యదర్శి శ్రీ డాక్టరు ప్రభాకరరావు గారు మన సంస్కృతిలోని లోపములను గుర్తింపవలె ననిరి. ఆడంబరములు విసర్జింపవలెననిరి.

ప్రధానఅతిథి గవర్నమెంటు జూనియర్ కాలేజి ప్రిన్సిపాలు ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత, శ్రీ చంద్రశేఖరరావుగారు ప్రసంగిస్తూ విద్యార్థులలో క్రమశిక్షణావశ్యకతను వివరించిరి. కొంచెము శ్రద్ధవహించినచో నేటి విద్యార్థులనేకములయిన మంచిపనులకు మార్గదర్శకులు కాగల రనిరి.

కళాశాల ప్రిన్సిపాలు శ్రీ నదీముల్లా కళాశాల సర్వతోముఖాభివృద్ధికి సక్రమ నిర్వహణకు చేయుచున్నకృషిని అందరూ ప్రశంసించిరి. కళాశాల నూతనభవన నిర్మాణ నిధికి సాంస్కృతిక ప్రదర్శనల ద్వారా కొంతధనము సంపాదించి ఇచ్చుటకు సంకల్పమును విద్యార్థి నాయకుడు ప్రకటించియుండెను.

అనంతరము వివిధ వినోదప్రదర్శనములు చక్కగా నిర్వహింపబడినవి.

---

( 20 వ పేజీ తరువాయి )

ఈవిధముగ మహాభక్తసుకవి యైన వానికిం గావ్య నిర్వాహణ మేమి వింత?

'సత్కవిత్వ మనఁగాఁ గాతట్యా పీయూష మాధురీపోషితం' అని గ్రహించిన విజ్ఞులు శ్రీ వేంకటేశ్వరులు.

వీరి చేతంబడిన దేవీ భాగవతము చక్కని తాకలం దిదినది. చదివి చక్కగా సంతోషింపవలసిన సద్గ్రంథ మిది యని పెక్కుమారులు నొక్కి వక్కాణించినను, అది సహాయోక్తి యే కాగలదు.

'శ్రీదేవీభాగవత మితర సంపుటములు కుండ త్వరలో నే వీరు ప్రచురింతురు గాక!

– శ్రీ గౌతమ.

---

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతిలేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు —

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జి. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B. V. & Co , Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.